# పరమాత్మ తత్త్వం

## ముక్తుల సూక్తులు

*Compilation*

**P.S.N.MURTHY**

# DIVINE KNOWLEDGE

## Sayings of Saints

**Bi-Lingual ENGLISH - TELUGU**

శ్రీ జ్ఞాన సాయి కేంద్రము

సాంఘిక ఆధ్యాత్మిక (రిజిస్టర్డు) ట్రస్టు, చిక్కడపల్లి, హైదరాబాదు - 20.

SRI GNANA SAI KENDRAM TRUST, HYDERABAD - 20.

# పరమాత్మ తత్వం

(ముక్తుల సూక్తులు)

# DIVINE KNOWLEDGE

*Sayings of Saints*

*Compiled by :* **P.S.N. Murthy**

సంకలనము

**పి. సూర్యనారాయణ మూర్తి**




*Published by :*

**SRI GNANA SAI KENDRAM**

**Socio - Spiritual (Regd.) Trust**

**H.No. 1-8-4/1/5, 3rd Floor, Chikkadpally**

**Hyderabad - 20. Ph - 040 - 7672265**

**శ్రీ జ్ఞానసాయి కేంద్రము - హైదరాబాదు**

**Bi-Lingual Telugu English**

*Copy Rights* WITH TRUST

జ్ఞానసాగర తరంగాలు - 2
GNAANA SAAGARA
TARANGAALU - 2

పరమాత్మ తత్వం (ముక్తుల సూక్తులు)

**DIVINE KNOWLEDGE**
*Sayings of Saints*

*Concept & Compilor* : **P.S.N. Murthy** Hyderabad

*Publisher* : **SRI GNANA SAI KENDRAM**
Socio - Spiritual (Regd.) Trust
**No. 1-8-4/1/5, Third Floor**
**Chikkadpally Hyderabad - 20**
**Phone - 040 - 7672265**

*First Published* : 1000 Copies (31-12-2000)

*For Copies* : (a) **SRI GNANA SAI KENDRAM**
(Ph : 040 - 7672265) Hyd-20

(b) **Sri Viswa janani Parishat**
Jillellamudi, Bapatla Taluk
GUNTUR Dt. Pin - 522113

(c) **P.S.N. Murhy**
**Flat No. 4 "C" Block, First Floor,**
**Hyderabad Industries Ltd. Colony,**
**Sanath nagar, Hyderabad - 18**

*Printer* : **R.S. SHARMA,** *B.A., D.P.T., B.Ed.,*
"*Antaryami*" **Splendours in Megaprints**
(Ph : 040 - 7642459)

*Price* : Rs. 30/- (US $10)

## గమనిక:-

తెలుగు, ఇంగ్లీషులో వ్రాసిన సూక్తులు ఒకదాని నుండి మరొకటి తర్జుమా చేసినవి కావు అని వేర్వేరు ముక్తులచే చెప్పబడినవి.

యీ పుస్తకము మూల్యము దైవ, లేక ధర్మ సంస్థలకు విరాళముగా యివ్వకోరిక.

## *Please Note: -*

Sayings written in Telugu and English are not the translation of one from the other.
But Compiled from different Saints.
Cost of this book may kindly be donated to saints or charitable trusts (Annapurnalayam.)

*Copy Rights* WITH TRUST

జ్ఞానసాగర తరంగాలు - 2
GNAANA SAAGARA
TARANGAALU - 2

పరమాత్మ తత్త్వం (ముక్తుల సూక్తులు)

**DIVINE KNOWLEDGE**
*Sayings of Saints*

*Concept & Compilor* : **P.S.N. Murthy** Hyderabad

*Publisher* : **SRI GNANA SAI KENDRAM**
Socio - Spiritual (Regd.) Trust
**No. 1-8-4/1/5, Third Floor**
**Chikkadpally Hyderabad - 20**
**Phone - 040 - 7672265**

*First Published* : 1000 Copies (31-12-2000)

*For Copies* : (a) **SRI GNANA SAI KENDRAM**
(Ph : 040 - 7672265) Hyd-20

(b) **Sri Viswa janani Parishat**
Jillellamudi, Bapatla Taluk
GUNTUR Dt. Pin - 522113

(c) **P.S.N. Murhy**
**Flat No. 4 "C" Block, First Floor,**
**Hyderabad Industries Ltd. Colony,**
**Sanath nagar, Hyderabad - 18**

*Printer* : **R.S. SHARMA,** *B.A., D.P.T., B.Ed.,*
"*Antaryami*" **Splendours in Megaprints**
(Ph : 040 - 7642459)

*Price* : Rs. 30/- (US $10)

# స్మరణ

బ్రహ్మజ్ఞానులు, యోగీశ్వరులు, అవతారమూర్తులు, భక్తాగ్రేసరులు మొదలైనవారు, మాయా సంసారములో దారికానక అలమటిస్తున్న మానవులకు వెలుగుచూపి మనలనుద్ధరించుట కొరకే వారు అవతరించుదురన్న సత్యము మనకందరకు తెలిసినదే. అదివారి కర్తవ్యముగా నెంచి సంకల్పించుదురు. అదివారి వేదనకూడానేమో!

వారు ఆత్మ స్వరూపులు కనుక వారి లీలలను, వారి అమృత వాక్కులను మనము, మననము, శ్రణము ద్వారా భక్తి శ్రద్ధలతో స్మరిస్తే, సర్వవ్యాపి యగువారు. మనహృదయావేదనను, బిడ్డ అమాయకంగా, ఆతృతతో తల్లిని పిలిస్తే, తల్లి అంతకు పదిరెట్లు ఆతృతతోవచ్చి, బిడ్డను కౌగిలించుకొనునట్లు, మనము ఆర్తితో ఒకసారి స్మరించిన, దయామయులు, సర్వవ్యాపులైన ఆ మహాత్ములు, తమకృపాదృష్టిని మనవైపుకు సారించి, మనయందలి వారి ప్రేమానురాగాలను, వారి ఆశీస్సుల ద్వారా మనపై వర్షింపచేయుదురు. మనందరిలోను, భక్తి బీజములనాటి, మన ఆధ్యాత్మిక సాధనలద్వారా తామే వాటికినీరుపోసి, పెంచి మహావృక్షమును చేసి, మరల (వారి ఆధ్యాత్మిక పురోభివృద్ధితో) తన వంతుగా యింకొక పదిమందికి దోహద పడునట్లు, మన ఆధ్యాత్మిక దృష్టిని పెంపొందింప జేయుదురు.

ఇంతటి మహనీయుల మాటలను స్మరింపజేయుటకొరకేనాకు స్ఫూర్తి నిచ్చిన వారి గ్రంథముల నుండి, వారి అమృత వాక్కులను, సేకరించి భక్తుల సౌలభ్యము కొరకు మాత్రమే ఇందు పొందు పరచినాను. యిది వారిని మరొకసారి వారి మాటలద్వారా జ్ఞాపకము చేయుటయే నా ఉద్దేశ్యము. కాని యిందులో నేను నిమిత్త మాత్రుడనే. నాకు ఈ షన్మాత్రమైన స్వార్థములేదు.

కనుక ఆ మహనీయుల సంకల్పానుసారము ఏర్పడిన, అయా ఆధ్యాత్మిక సంస్థలు యీ విషయమును గమనించి, ఈ ప్రచురణకు నన్ను మన్నింప ప్రార్థన. ఇంకా ఎందరో మహానుభావులు, మన భక్తి ప్రపత్తులకు ప్రసన్నులైనట్లు మనకు తెలియకుండా మనలను ఆశీర్వదిస్తున్నారు. వారందరికి నా ప్రణామములు.

ఇట్లు
భగవత్సేవలో
పి. సూర్యనారాయణమూర్తి
హైదరాబాదు



# 1

## దైవము లేక శక్తి

1) పూర్వోక్త రీతిని నేను జ్ఞానానంద స్వరూపుడగు, పరిశుద్ధ జీవుడను గాని, ప్రకృతి సంబంధంతో కూడిన మలిన జీవుడనుకాను అనే రహస్యమును తెలుసుకొని, శ్రీహరిని నిరంతరమూ ఆరాధించుచుండిన యడల ప్రాణము యొక్కయు, చిత్తము యొక్కయు, చాంచల్యము తగ్గి తనకుంకల మూలా అజ్ఞానము నశించును.

సాలెపురుగు తనలోనుండి వచ్చెడు తంతువులకు తాను ఉపాదాన కారణము, నిమిత్త కారణము, నైనట్లు "నేను" సమస్త ప్రపంచమునకు ఉపాదాన కారణము, నిమిత్త కారణము, నైవున్నాను. మరియు ఈ కార్యకారణ సంఘాతములెల్ల "నేనే అయివున్నాను"

తెలియబడుచున్న విశ్వంబు దృశ్యమనుచు
తెలివినై సర్వమునుగాంచు దృక్కునేను
మిగుల నాకంటె అన్యమేమియులేదు
సత్యమిది సర్వ వేదాంత సంగ్రహంబు - **సీతారామాంజనేయ సంవాదము**

2) ఆ పరబ్రహ్మము తనకు తానే ప్రపంచమునుగా చేసుకొనును. కావున జగత్తు పరబ్రహ్మము. బంగారుచే నగలు నిర్మితములగుచున్నవి. నగలు కర్ణకుండలములనియు, గొలుసు అనియు, కడియములనియు, ఈ

ప్రకారము నానా విధములుగా, నానా నామములతో పిలువబడుచున్నది. కుండలు, మూకుడు, బానా, ముంత అను బేధముతో నున్నవి. వానికి కారణమగు బంగారమును, మట్టిని చూచిన ఏకత్వమే నిష్పన్నమగును. కాబట్టి. కార్యదృష్టిని విడనాడి, కారణ దృష్టియగు పరబ్రహ్మ దృష్టితోనే సకలముగాంచిన, అంతయు పరబ్రహ్మమే. ఈ కార్యకారణ వాదము కూడా సత్యము గాదని శృతి భగవతి ప్రతిపాదించుచున్నది. **– వివేక చూడామణి**

3) చిత్తునేనే, జీవ చైతన్యము నేనే. స్వర్గమునేనే. ఆకాశమునేనే. సూర్యుడు నేనే. భూమియు నేనే. బ్రహ్మమునేనే. అనునిట్టి నిశ్చయమే సత్యమైనది.

నానా పదార్థ రూపమున భాసించు ఈ సమస్తమున్ను, ఆధ్యంత రహితమై నిర్వికారమైనట్టి చైతన్యమే అనియు, ఆ చైతన్యము నేనే అనియు ఎరిగి యుండుట వలన సంతాప వర్జితుడనై నేను జీవించు చున్నాను.

**– యోగవాశిష్టము**

4) దివ్య సంకల్పము సృష్ట, స్థితి, లయముల, రూపాన ప్రకటన మగును. కర్మ యోగము ద్వారా సృష్టి యొక్క అంతరార్థము, భక్తి యోగముతో స్థితి యొక్క నిజస్వరూపము, జ్ఞాన యోగము ద్వారా విభిన్న స్వరూపాలు, అభిన్న తత్వములో లయం పొందే విధమును అవగాహన చేసుకోవాలి. భక్తి ద్వారా సర్వాశ్రయుడై సకలాధారుడైన పరమాత్మను గ్రహించ గలరు. అదే నిత్య, సత్య, నిర్మల ప్రేమ.

ఈశ్వరార్పితము చేస్తే నీ కార్యక్రమములన్నియు పావనం కాగలవు. అన్ని కార్య కలాపాలకు భగవంతుడే ప్రేరకుడు. తగిన శక్తి యుక్తులు ప్రసాదించి పనులు జరిపించేది ఆయనే. పనులవల్ల కలిగే ఫలమును ఆస్వాదించే భోక్త ఆయనే. అన్ని కర్మలకు ఆయనే కారకుడు. సర్వము ఆయనదే. నాది అనేది లేనే లేదు. మీరు నిర్వర్తించే సమస్త కార్యకలాపాలను నడిపించే వాడు ఆయనే. అన్న విశ్వాస బలంతో పనులు చేయడమే మీ వంతు. **– భగవాన్ సత్యసాయిబాబా**

5) తెలిసినా, తెలియక పోయినా, చూసినా, చూడక పోయినా, నమ్మినా, నమ్మక పోయినా, ఈ ద్వంద్వాలు, ద్వంద్వాలకు ఆధారమైన శక్తి ఒకటి ఉన్నదని, సర్వమూ తానే జరుపుకుంటోందని తెలుసు కోవాలి.

**– జిల్లెలమూడి అమ్మ**

6) గమనించే శక్తికి మనస్సు, చిత్తం, గుర్తు, అహంకారము - అని రకరకాల పేర్లు పెట్టారు. గుర్తు వస్తేనే గుర్తు చేసుకోవడం. గుర్తుకూడా ఇస్తే వచ్చేదేగా! గుర్తే దైవము. గుర్తును గుర్తించాలంటే ప్రేరణ కావాలి. కాబట్టి రెండూ ఒకటే. కావాలనుకుండేవాళ్ళము మనము. అవసరాలను గుర్తించేవాడు భగవంతుడు. నామ రూపాలు లేని వాడిని చూడడానికి నామాన్ని చేస్తున్నాము. అహం బ్రహ్మాస్మి అంటే "అహంకూడా వాడేనని". క్షేత్రంలో వున్నాడు క్షేత్రాన్ని నడిపిస్తున్నాడు. క్షేత్రమై వున్నాడు. కృష్ణుడు కూడా విశ్వరూపం అంటూ ఈ సృష్టినేగా చూపించాడు. ఏదైతే సర్వత్రా వున్నదో అదే అనేక రూపాలు. అంతటా వున్నదానిలో ఎవరెవరి ఇష్ట దైవాన్ని వాళ్ళు చూస్తున్నారు గజంలో అంగుళాలున్నయి కాని, అంగుళాల్లో గజాలు లేవుగా. **– జిల్లెలమూడి అమ్మ**

**7) ప్ర :– కోర్కెలు తీర్చటానికి దేవుణ్ని ప్రార్థిస్తారుకదా! ఇస్తాడా?**

అమ్మ:- ఇస్తాడో లేదో అనుభవించిన వాడికి తెలుస్తుంది. నేనేమో దొంగరాకుండా కాపాడమని దణ్ణం పెట్టుకొని పడుకుంటున్నా. దొంగ బయలు దేరబోతూ నాకు ఇవాళ ఏమన్న బాగా దొరకాలి అని దణ్ణం పెట్టుకుంటాడు. రెండింటికి ప్రేరణ ఒకటే. సృష్టిలో ఎప్పుడు, ఎక్కడ, ఏది అవసరమో అది ఇవ్వటమే అనుగ్రహం అనిపిస్తుంది నాకు.

పెరుగు, మీగడ, వెన్న, నెయ్యి అన్నీ పాలలో వున్నై. కాని విడదీస్తే దేని గుణాలు దానివే. శక్తి, మనస్సు, గుర్తు అన్నానందుకే **– జిల్లెమూడి అమ్మ**

8) శక్తి కనబడదు. కని పెడుతుంది. శక్తిని గుర్తించటానికి రూపమే ఆధారం. చెప్పుకోవడానికే ఆకృతి. అంతటా వున్నదైవం శరీరంతో రావడానికి కారణం అదే. తాను రాకుండా చేయలేదా? అంటే చేయగలడు కాని వాడిని

గుర్తించేదెట్లా? నడిచేకాల్ళు కనిపిస్తున్నా నడిపించే శక్తి కనపడదు.

ప్ర :- **దేవుడికి ముడుపులు ఇవ్వాలంటారేమిటి?**

అమ్మ :- ముడుపులు ఇవ్వడమంటే - మనస్సును ఇవ్వడమే. ఆ మనస్సును ఇవ్వలేక వస్తురూపంగా ఇచ్చి తృప్తిపడదామని.

ప్ర :- **బాబా నాకు కనబడతారా అమ్మ?**

అమ్మ :- ఏమో కనపడాలనుకుంటే కనపడతారు. నీ చేత నామమే చేయించు కోవాలంటే చేయించుకుంటారు. (నామము చేయడానికి కూడా నీకు స్వంత్రములేదు) నిర్ణయాను సారము తప్ప.

ప్రతి రూపానికి కాలం వుంది. కాలంలో శక్తి కనబడదు. శక్తి మార్పుగా వుంది. అన్నీ చేస్తుంది. అన్నీ వింటుంది. ఆ కాలాన్ని ఎట్లా ఉపాసించాలి? నేను చూసినప్పుడు, నేను గుర్తించి నపుడు వుంది - నేను గుర్తుగా - కాలంగా మనసుకు రూపంలేదు అనేది ఎట్లాగో, అలాగే ఇదీని. మార్పు వస్తువుకు సహజము. శక్తి శాశ్వతము. రూపాలు మార్పు. గింజ, గింజకు శక్తి వుంటుంది. మార్పు చేసేది శక్తే. అన్నీ ఎట్లా చూడగలవు? పువ్వు వంక చూస్తావు. పువ్వు వికాశం తెలుస్తుంది. చైతన్యం కంటికి కనపడదు. **– జిల్లెలమూడి అమ్మ**

9) పంచ భూతాలన్నీ కలసి అన్నమయింది. మనకు అన్నమే కనపడుతుంది. అందుకు కారణమైన పాళ్ళు గమనించడం లేదు. మిగతావి చూడము, ప్రదానముగా తీసుకొనము. అన్నీ తానే అయ్యింది అనే కారణము గుర్తుకు రాదు. అదే ఉప్పు, అదే తీపి అయింది, అన్నీ తనే చేసాడనటం లేదు - స్వభావం. వున్నది బ్రహ్మ. చేశాడు అన్నప్పుడు దైవం ఎక్కడో దూరంగా వుండి చేశాడన్న భావం వస్తుంది. చీమగా, దోమగా అయినాడన్నప్పుడు సంపూర్ణత్వం. అన్నీవాడే అయి, అన్నీ వాడే చేస్తున్నాడు. సహర్ష శీర్ష పురుషహః అంటే అదే. చేశాడు అన్నప్పుడు వేరై పోతున్నాడు. చేశాడు అన్నప్పుడు ద్వంద్వమున్నది. అయినాడు అన్నప్పుడు ఒకటే వున్నది. **– జిల్లెల మూడి అమ్మ**

10) నీ ఇచ్ఛాశక్తి సంకల్పించింది, నీ క్రియాశక్తి ప్రపంచంగా ఏర్పడింది, నీ జ్ఞానశక్తి అందులోనికి ప్రవేశించి సమస్తాన్ని వ్యవహరింప జేస్తుంది. ప్రకృత్యాదులు వ్యవహరిస్తున్నవి అంటారు కాని బొమ్మలాడే ఆట ఎటువంటిదో ప్రకృత్యాదుల వ్యవహారం కూడా అటువంటిదే. బొమ్మలను ఆడించిన తీరునుబట్టి బొమ్మలాట వుంటుంది. అంతేకాని ఆ బొమ్మలకు స్వతంత్ర్యశక్తి లేదు. **– భాగవతము**

11) భగవాన్ ఉవాచ :- నేనుగాని, నా అన్నయ్య బలరాముడు కాని, మా తల్లి దండ్రులైన మీరుగాని, ఈ ద్వారకా వాసులుగాని, అఖిల చరాచరాత్మక ప్రపంచముగాని, సర్వము బ్రహ్మమే. తత్ బ్రహ్మభిన్నమైనది వేరొకటిలేదు. ఆకాశాది పంచభూతాలు, తత్‌భూతకృత్యాలు. భౌతికాలు అయిన జలదర్పణాదులలో ప్రతిఫలించటాన్ని మీరు చూస్తున్నారు కదా! అదే విధంగా పరబ్రహ్మము తనచే సృజించ బడిన గుణాలలో, గుణ కార్యాలైన దేహాదులలో నానా రూపాలతో కనపడుతుంటుంది. చావు పుట్టుకలు కాని, ఆధిక్య, అనధికతలు కాని, ఏకత్వ నానాత్వాలుకాని, నర్యమవాభగవత్ నిషస్త్రనాలే అని, అన్నితత్ఫతార్ధా తత్వాన్ని బోధించేదే అని తెలుసుకోవాలి. ఈ రహస్యాన్ని గ్రహించి చేదబుద్ధి వదిల వర్తించే వారికి అంతులేని సుఖం కలుగుతుంది.

**– భాగవతం**



## 2

# అర్చనా లేక పూజ

1) శమ, జ్ఞానాదుల పుష్పములచే ఆత్మ దేవుడు పూజింప బడుటేది కలదో అదియే దేవార్చనమని ఎరుగుము. అంతేకాని ఆకార అర్చనము పరిపూర్ణ అర్చనము కానేరదు. పరిపక్వముకాని బుద్ధికలవారును, బాలురకు వలె అల్పచిత్తము కలిగియున్నవారును అను మందాంధికారుల కొరకే కృత్రిమ సాకారమయ దేవార్చనము చెప్పబడినది.

ఎంత వరకును నీ చిత్తము శుద్ధము కాకయుండునో అంత వరకును సాకారమును (శంకరాదుల రూపమును) అర్చింపుము. తదుపరి (అట్టి సాకారము యొక్క ధ్యానాదులచే) నిరాకారమగు పరమాత్మ తత్వమున నీకు సహజమగు స్థితి ఏర్పడగలదు. - యోగవాశిష్టము

2) భగవంతుడు ఏదో ఒక ప్రత్యేకమైన ప్రదేశములోనున్నాడు కాని హృదయస్థాయి అని నమ్మక పోవుటచే మానవుడు భగవంతుని సర్వాంతర్యామిగా గుర్తించుటలేదు. ఇట్టి సామాన్య దోషము సామాన్య మానవులే కాక, అనుభవజ్ఞులు మహా పురుషులు కూడా చేయుచున్నారు. ఆ విధముగానే శంకరాచార్యులు కాశీపట్టణములోని విశ్వేశ్వరుని చేరి, ఆనంద భాష్పములతో తమలోని మూడు దోషములను విన్నవించారు. అందులో మొదటి పాపము "యధక్ష వాచో నివర్తంతే". వాక్కునకు మనస్సునకు

అతీతడవను సంగతి తెలిసినప్పటికి నిన్ను మాటలతో వర్ణిస్తున్నాను. ఇంద్రియములకు చిక్కని భగవంతుని ఇంద్రియములతో వర్ణించుటయనే పెద్దపాపము చేయుచున్నాను.

ఇక రెండవది "ఈశావాశ్య మిధం సర్వం". ఎక్కడ చూచినా, ప్రతీచోటా ఆత్మ స్వరూపుడై సర్వత్రా నివసించువాడు భగవంతుడు అని తెలిసి కూడా అసత్య మార్గములో ప్రయాణించి, వేలాదిలోనిన్ను చూడక, కాశీపట్నం వచ్చాను. జీవుడే దేవుడను తత్వమును అందరికీ బోధించాను. జీవేశ్వర ప్రకృతి అని త్రిగుణాత్మకమైన భావమును తిరస్కరించి ఈ మూడూ ఒక్కటే అని ప్రచారం చేసికూడా. ఒక బీద బ్రాహ్మణుని "భజ గోవిందం, భజగోవిందం, మూఢమతే" అని అతనిని నేను మూఢమతే అని దూషించాను. అందరిలో ఏకత్వాన్ని బోధించిన అద్వైత మతానికి విరుద్ధంగా అతనిని నిందించాను. ఇదే నేను చేసిన మూడవ పాపము. ఈనా దోషములను మన్నించి, కటాక్షించి, నా పాపములను హరిహరించమని ఆదిశంకరులు మానవునకు గుణపాఠము నేర్పు నిమిత్తము విశ్వేశ్వరుణ్ణి ప్రార్థించెను. **– భగవాన్ సత్యసాయి బాబా**

3) నాచే ఈపని చేయిస్తున్నాడు (పరమాత్మ) అనుకున్నప్పుడు అదే సాధన, తపస్సు, యోగం అవుతుంది.

**ప :– ప్రార్థన చేసినా జరగదా?**

అమ్మ :- ప్రార్థన చేయించేది అదే, నిర్ణయానుసారము

జపం పూజ మానుకోమని కాదు -- అది చేయించేది వాడే అంటున్నా

**– జిల్లెల మూడి అమ్మ**

4) అంతర్యామి పూజ మొట్ట మొదట ప్రచారంలో వుండేది. తరువాత ఉపాధి తారతమ్యాలను బట్టి అంతర్యామి స్వరూపంలోనూ తారతమ్యాలను కల్పించారు. తత్ పలంగా న్యూనాది కతలు, రాగద్వేషాలు పరస్పర స్పర్థలు సంభవించాయి. త్రేతాయుగంలో పెద్దలు ఇది గ్రహించి పూజార్థం భగవత్

ప్రతిమలను ఏర్పరచి తత్ ప్రతిమా పూజలను విధించారు. నాటినుంచి కొందరు ప్రతిమాదులలో భగవంతుని ఉపాసించటం మొదలు పెట్టారు. ప్రతిమలు బహువిధాలుగా కన్పించినా వాటిలో అంతర్యామి భగవంతుడొక్కడే వున్నాడు. విగ్రహ బేధాలను బట్టి భగవత్ భేదాలను ఊహించి పూజింప కూడదు. భేద భావాలతో చేసిన పూజలు నిరర్థకాలు. – **భాగవతం**

5) అహింసాత్మకమగు సత్య జీవనము గడుపుటకు సరిపడు పరితాపమే ప్రార్థన. తనకు ఇసుమంతయు వుంచుకొనక దైవకార్యములకు సమర్పించువాడు ముక్త జీవుడన బడును. తనకు కావలసిన దానిని వుంచుకొని మిగిలిన దానిని సమర్పించువాడు ధన్యజీవుడన బడును. – **గాంధీజీ**

6) **అసలు నివేదనా అంటే ఏమిటి?**

నువ్విచ్చిన తిండి, నువ్విచ్చిన మనస్సు, నువ్విచ్చింది అని గుర్తిస్తున్నాము. అంతేగాని నివేదన అంటే పదార్థముకాదు. వాడు ఇచ్చాడనే గుర్తింపు వుండాలి.

– **జిల్లెలమూడి అమ్మ**



3

## మనస్సు

1) మనసే అవిద్య ఈ మన్నస్సుకన్న అవిద్యకాని, మాయకాని వేరు లేదు. ఇట్టి మనస్సే సంసార కారణము. అది నశించిన సమస్త ప్రపంచము లయమగును. అది చలించిన సమస్తము చలించు చున్నది. మనస్సుండిన ప్రపంచముండును. అది లేక పోయిన ప్రపంచము లేదను అన్వయ వ్యతిరేకముల కదియే బంధ కరాణము ముక్తి హేతువును కూడా అగుచున్నది. చిత్తమేవ సంసారః, చిత్తే చలతి సంసారః నిశ్చలే మోక్షయేవహి ! ఇత్యాది ఉపనిషత్తుల ప్రమాణము.

పశువు త్రాటిచే ఎలాగున కట్టబడునో అదే ప్రకారముగా మనస్సుచే కల్పింప బడిన దేహేంద్రియాది విషయానురాగముచే పురుషుడు బంధింపబడుచున్నాడు. ఇట్టి బంధమునకు విషయాత్మకమగు మనస్సే కారణము. అనగా సానురాగ మనస్సు సంసార హేతువు. విరక్త మనస్సు సంసార బంధ చేధకము. **– వివేక చూడామణి**

2) ఓ రామచంద్రా ! చరాచరాత్మకమగు జగత్తంతయును చిత్తమునకు అధీనమైనున్నది. కాబట్టి బంధ మోక్షములు రెండునూ కూడా చిత్తాధీనములే అయి వున్నవని స్పష్టమగుచున్నది.

ఓ రామచంద్రా ! నీవు మనస్సును నశింప చేయునట్టి భావనయందే

నిమగ్నుడవై వుండుము. మనస్సు మనస్సు చేతనే బలాత్కారముగా (విషయములనుండి నిగ్రహింపబడి) తరింపజేయ బడవలెను. అట్లుకాకున్న మోక్షమునకు వేరొక ఉపాయమెద్దియును లేదు.

ఓ రామచంద్రా! ఈ సంకల్పమే, మనస్సు, జీవుడు, చిత్తము, వాసనా సహితమగు బుద్ధియు, ఈ సంకల్ప మనో జీవాదులకు పేర్లలో మాత్రము భేదము కలదేగాని అర్థమందుకాదు. (అవి అన్నియు సంకల్పము యొక్క పర్యాయ వాచకములే అని తెలుసుకొనుము) **– యోగవాశిష్ఠము**

3) ఆత్మ మనస్సును దాటియుంటుందంటారు. మళ్ళీ ఆత్మను మనస్సుతోనే పట్టు కోవాలంటారు. ఈ రెంటికీ సమన్వయమెలా?

రమణభగవాన్ :- అవును. ఆత్మను, మనస్సుతోనే పట్టుకోవాలి. అయితే సంకల్పాలతో కూడిన మనస్సుతో కాదు. ఏకాగ్రమై, అంతర్ముఖమైన మనస్సుతో ఇక్కడ గ్రహించ వలసినది ఏమిటంటే ఒక వ్యక్తి తనకు అన్యంగా వున్న వస్తువును పట్టుకోవటం వంటిది కాదు. ఆత్మను పట్టుకోవడమంటే లోచూపుతో మనస్సు తన జన్మస్థానమైన ఆత్మను కనుగొని అందులో లీనమై పోవటం.

**ప్ర :- మనోచలనం ఆపటానికి ఏదైనా సులభోపాయం వున్నాదా?**

రమణభగవాన్ :- వుంది. నీ ఉచ్ఛ్వాస, నిశ్వాసాలను గమనిస్తూ వుండు. జడమైన దేహం నేను అని అనదు. చైతన్యమైన ఆత్మ నేనీదేహాన్ని మాత్రమే అని అనదు. ఈ రెంటికీ మధ్య "నేను" అంటూ తలెత్తుతూవున్న ఈనేనుగారెవరో విచారించాలి.

నేనెవరిని :- ఈ నేను అనే భావన ఎక్కడ నుండి పుట్టుకొస్తోంది? అని లో దృష్టితో విచారించాలి. అన్వేషించాలి అప్పుడు అన్వేషించే "నేను" (మిధ్యానేను) అద్వితీయమైన, అనిర్వచనీయమైన "నేను" (ఆత్మ)లో అదృశ్యమై పోతుంది. **– రమణభగవాన్**

4) "యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసా సహః" అనునట్లు బ్రహ్మము అవాజ్ఞ్మనస గోచరము అని ఒక భక్తుడు వాదింప?

గురుదేవులు :- అది సరికాదు. పరిమితమగు మనస్సుచే భగవంతుని తెలుసుకొని జాలమనుట నిజము. సంధియములేదు. కాని శుద్ధమన్సుచే వానిని తెలుసుకోవచ్చును. శుద్ధ మనస్సనిననను, శుద్ధ బుద్ధియనినను ఒక్కటే. మరియు నిరుపాధికమగు ఆత్మయు శుద్ధ బుద్ధియు ఒక్కటే. కామిని కాంచనముల యందలి మోహముల వలన ఇంద్రియ బద్ధమగు సంకుచిత బుద్ధిచే లేక పరిమితము, సాపేక్షమునగు మనస్సుచే వానిని గ్రహింప జాలమనుట నిజము. మనస్సు సాధనచే ఇంద్రియ లోలతను బాపుకొని శుద్ధము కాగలదు. విషయ వాసనలను, కోరికలను, మోహరాగములను, తొలగించుకొని అఖండాత్మలో ఐక్యము నొందవచ్చును. పూర్వము మహర్షులు భగవత్‌సాక్షాత్కారము పొందినది ఈ విధముగనే కదా! అఖండాత్మ స్వరూపుడగు భగవంతుని మహర్షులు శుద్ధమనస్సు చేతనే చూడగలిగినది. ఆ శుద్ధ మనస్సే ఆత్మయని వారు గ్రహించిరి. సాధారణముగా మనస్సును, బుద్ధియు, పరస్పర భిన్నములని చెప్పుట కలదు. కాని అవి పరిశుద్ధమైనప్పుడు ఏకమై చైతన్యమున లయించును. అప్పుడు చైతన్య స్వరూపుడగు భగవంతుడు చైతన్యమునకే సాక్షాత్కారించును. **– రామకృష్ణ పరమహంస**

5) లౌకిక విషయాలకు ఏ శక్తి సహాయపడుతుందో ఆధ్యాత్మికాలనే వాటికి కూడా అదే సహాయపడుతుంది.

**ప్ర :– మనస్సు అస్వతంత్రురాలు కదా?**

అమ్మ :- స్వతంత్రురాలును. రెండుచూచినపుడు అస్వతంత్రురాలు. మనస్సు దైవమైనప్పుడు అస్వతంత్రురాలెట్లు?

సంకల్పంవేరూ, దైవంవేరూ, మనస్సు వేరూ కాదు (అన్నీ ఒక్కటే అని అర్థం) ఆత్మ చేతనే మనస్సు ఏర్పడ్డది. దానికి వినాశం లేదు. రూపాంతరమే కాని,

రూప నాశనం లేదు. మనస్సు అంతటా వుంది కదా! కేవలం గుండె దగ్గరేకాక. ప్రాణంకూడా శరీర మొత్తంలో ఎక్కడ వుంది అంటే ఏం చెప్తాము. తడిగుడ్డలో తడి ఎక్కడ వుంది అన్నట్లు.

మనస్సుతో మనస్సును నేరుగా గుర్తించలేరు కనుక వేరొక దానిని ధ్యేయంగా పెట్టుకొని గుర్తించటం మంత్రజపం అంటే. మనస్సు లయమయ్యే చోటు ఆలయం హృదయమంటే సర్వమూ గుర్తించేది. - **జిల్లెలమూడి అమ్మ**

6) మనస్సుకు ఆలోచనలు వచ్చే స్వభావం. జపం చేయాలన్నది ఆలోచనే. ఆలోచించకుండ వుండాలనుకునేది ఆలోచనే. ఆలోచన వచ్చిన తర్వాత తెలుస్తుంది. ఏదివస్తే అది అనుభవిస్తు సమయం వచ్చినపుడు చేస్తూవుండటమే.

ప్ర :- **మనస్సుతో మనస్సును గుర్తించడం అన్నారే? అది ఎలాగ?**

అమ్మ :- మనస్సు భగవంతుడే మనస్సుచేత ఏర్పడ్డ భక్తి భగవంతుడే. మనస్సును గుర్తించడానికి భక్తి ఆధారమైనది. భక్తికి మనస్సు ఆధారమైనది. అదే మనస్సుతో మనస్సును గుర్తించడం.

మనస్సు, పదార్థము ఒకటేనని గుర్తించిందే పరమార్థం.

ప్ర :- **శరీరంతో వుండి, శరీరంతో సంబంధంలేకుండా శరీరాన్ని (ఇంద్రియాల్ని) పనిచేయించేది మనస్సు. వాడి మనస్సు చెప్పినట్లు చేస్తే చాలా?**

అమ్మ :- వాడి మనస్సు చెప్పినట్లు అంటే మనస్సువీడి స్వాధీనం లేదుగా! మనస్సుకేవీడు స్వాధీనమైవున్నాడు కాని. మనస్సును అరికట్టే స్థితి ఇచ్చిన వాడికిగాని, పుచ్చుకున్న వాడికి లేదు.

భగవంతుడు అంటే మనస్సే. అది ఎక్కడో లేదు. మనస్సే దైవం అయినప్పుడు మనస్సును దైవంగా గుర్తించలేము కనుక ఒక రూపాన్ని ఆరాధిస్తున్నాము.

మనస్సంటే చరాస్థి, మనస్సు యొక్క పరిణామము స్థిరాస్థి.

మనస్సు ఒకదానిని గురువు అంటోంది. పూజిస్తుంది. ఇంకొకదానిని నిరాకరిస్తుంది. చేసేదంతా మనస్సే. చివరకు ఒకరూపం పెట్టుకుంటుంది. దానిని భగవంతుడు అంటుంది. ఆ భగవంతుని తనలో చూచుకొంటుంది. అయితే చేసేదంతా మనస్సే. చివరకు తనని తానే తెలుసుకుంటుంది.

శరీరంలో సంకుచితంగా పిలవబడినపుడు దానిని మనస్సు అన్నాము. అదే అఖండంగా వూహించినపుడు ఆత్మ అన్నాము. ఆత్మకు మనస్సుకు తేడా లేదు. మనస్సుకు వైకల్యంలేని స్థితి ఏర్పడితే - అదే కైవల్యం. నీ ఉన్నతికి దైవమే కారణము. కర్మకు దైవమే కారణము. కర్మ - క్రియ - జన్మరూపేణ ఉన్నది దైవమే. ఆ కర్తే కర్మకు, క్రియలకు కారణము – **జిల్లెలమూడి అమ్మ**

7) కంటిద్వారా చూచి, చెవి ద్వారా విని, స్పర్శ ద్వారా తెలుసుకొని, గ్రహించేదంతా మనస్సే. వున్నదే ఆ ఒక్కటి. సంకలేంద్రియముల ద్వారా (మనస్సు) అది పని చేస్తుంది. అన్నిటితో అన్ని పనులు చేస్తూ సర్వత్రానాడి వున్నది. మనస్సు తెలిపేది, తెలుసుకోనేది మనసే. ఎట్లా వుంది అంటే తెలివిగా - తెలివి తక్కువగా - మనస్సు అనేక రకాలుగా వున్నది. వినడం చూడటమేకాదు వున్నదే అది తెలివిలేని చోట కూడ మనస్సు వుంది. గ్రహించడం తెలివి.

(ఎ) "నా లోపాలు ఇచ్చాను మీకు" (అంటే నా దోషములు త్రిగుణాత్మకమైనవి) మాయా రూపంలోనున్న మనస్సుద్వారా ఇచ్చాను.

(బి) నాలో, పాలు ఇచ్చాను (అంటే నా స్థన్యములోని పాలు, అంటే పోషణ)

(సి) నాలో, పాలు ఇచ్చాను (అంటే తనపనులు, లేక కర్తవ్యము మనకిచ్చింది.)

మనస్సు స్వాధీనం కాలేదు కనుక ప్రారబ్ధము అడ్డు వస్తున్నది అంటారు. ప్రారబ్ధం అంటే పరమాత్మ అంటున్నాను నేను. నిండివున్న సత్తా (సత్) లో కదా ఇదంతా! నిండి వున్న సత్తాలోనుంచి వచ్చిన ఇవన్నీ సత్తేకాక ఇవన్నీ

ఏమవుతాయి? సత్తాకు నాకు మధ్య ఎవరూ లేరు. ఆలోచించాను. ఎవరన్నా ఏర్పడితే సత్తాయే కారణమై వుండాలి. **– జిల్లెలమూడి అమ్మ**

8) మనస్సన్నది ఏకకరణమన్నమాట సత్యం. మనస్సుకు రూపభేదం లేకపోయినా అవస్థా భేదం వున్నది. అవస్థా భేదాన్ని బట్టి ఏకమైన మనస్సు. సంసార మోక్షాల రెండింటికి కారణమగుతున్నది. అవస్థా భేదం ఎట్లు కలుగుతున్నది అంటే గుణాన్ని బట్టి అవస్థాభేదం కలుగుతున్నది. మనస్సు గుణబద్ధమైనప్పుడు సంసార హేతువు అవుతుంది. గుణ బద్ధం కానప్పుడు మోక్ష హేతువు.

మనస్సనే దానిని ఒక దర్పణానికి పోల్చవచ్చును. దర్పణంలో మూల వస్తువు ప్రతిబింబిస్తుంది. ఆ ప్రతి ఫలించిన ప్రతిబింబాన్ని చూస్తున్నప్పుడు మనస్సు మూల వస్తువు వంక మళ్ళదు. మూల వస్తువును చూస్తున్నప్పుడు దర్పణంలోని ప్రతిబింబం కనిపించదు. అలాగే మనస్సు భగవత్పరమైనప్పుడు భగవద్విలాసమైన ప్రపంచం కానరాదు. భగవద్విలాసం క్షణ క్షణ పరిణామాలతో కూడి శాశ్వతైక రూపంలేకుంటుంది. కాబట్టి అట్టి దానిని ఆశ్రయించినప్పుడు మనస్సుకు కూడా అటువంటి గతులే కలుగుతాయి. అందువలన క్షణికానంద రూపమైన ప్రపంచాన్నిమాని శాశ్వతానంద కరమైన భగవాన్ మూర్తిని ఆశించాలి

**– భాగవతం**

9) నిర్మలమగుచిత్తము పరమార్థ స్వరూపమే యగును. భావనా వశముచే అది జీవుడగును, మలిన చిత్తముగను అయి దేహాది రూపమున వ్యక్తమగుచున్నది **– యోగవాశిష్టము**



## 4

## జీవుడు

1) కార్యోపాధి కలవాడు జీవుడు. కారణోపాధి కలవాడు ఈశ్వరుడు. ఈ కార్య కారణముల విడచినా పరిపూర్ణ బోధయే మిగులును. ఇదియే జీవేశ్వరైక్యము. తత్వమసలను మహావాక్యార్థము – **వివేక చూడామణి**

2) ఇది అవిద్య. ఈతడు జీవుడు - ఈ మున్నగు కల్పనలు అజ్ఞాని యొక్క ప్రబోధము కొరకై జ్ఞానులచే కల్పింప బడినవే అగును – **యోగవాశిష్టము**

3) జీవుడంటే చైతన్యం. పరిమితమైన మమకారం మానవత్వం. కర్తృత్వం కొంత తనది, కొంత దైవానిది అనుకోవడము మానవత్వం. భ్రాంతితో కూడిన బ్రహ్మే మానవత్వం. భ్రాంతి వదిలితే బ్రహ్మ. మానవత్వము పరిమితమైన మమకారమువల్ల గుర్తించ బడుతుంది. సర్వత్రా మమకారము మానవత్వపు గుర్తు. మమకారపు పరిమితే భ్రాంతియని, ఆ భ్రాంతిలేక ఆ పరిమితి పోతే బ్రహ్మ.

ప్ర :– **జీవుడనే వాడున్నాడంటారా?**

అమ్మ ఉవాచ :- వైకుంఠపాళి ఆడతారు కదా! దానిలోని పావులు మీరేనా! కాదు. అది భావన. ఇంతలావు, ఇంత పొడవు వున్న మీరు ఒక చింతపిక్క పావుతో తాధాత్మ్యము పొంది దాని సుఖ, దుంఖాలు అనుభవిస్తున్నారు కదా! అలాగే మీరు అసలు "నేను" అనుకొనే చైతన్యము

- విశ్వమంతటా యున్నది. అయినా నీ శరీరమనే పావుతో తాద్యాత్మము చెంది ఈ శరీరానికి కలిగే వడుదుడుకులకు లొంగిపోయి దాని సుఖః, దుఃఖాలు అనుభవిస్తున్నారు.

ప్ర :- **మనమంతా "నేను, నేను" అనుకోవడము, మన అనుభవాలు జీవితంలో వేరు వేరు అవడమేమిటి?**

అమ్మ ఉవాచ :- వైకుంఠపాళి ఆటలో మీరు నేనింత లావుగా వుండి పావులతో తాదాత్మ్యము చెందడము కనపడుతూనే వుంది కదా! అలాగే అంతా తానే అయిన చైతన్యము - సముద్రములాగే - కెరటాలు - గాలి, నీరు, ప్రాణులు అయింది. భౌతిక పరిమితో తాదాత్మ్య పరిమితి వచ్చింది. ఇక అనుభవాలు వేరవడమా అంటే ఒకచేతి వ్రేళ్ళు, ఒక తల్లిదండ్రుల బిడ్డలు, ఒక చెట్టు ఆకులు, ఒక గుప్పిటిలోని ఇసుక కణాలు అన్నీ వేర్వేరు. వైవిధ్యమే అంతా అయినదాని లక్షణము **- జిల్లేలమూడి అమ్మ**

4) శరీరపురిని ప్రవేశించి పరమాత్మ జీవరూపమున దేహేంద్రియ సంఘాతమునకంతకు అధిపతి అయి దానికి ఏలిక అగుచున్నాడు. వేషధారియగు నటునివలె నా సంఘాత ముఖమున బాహ్యమునకు స్పురించుచు ప్రారబ్ధము అనుభవించు చున్నాడు. ఇట్టి జీవాత్మ జాగ్రత్ కాలమున నేత్రమందు, స్వప్న కాలమున కంఠమందు, సుషుప్తి కాలమున హృదయమందు క్రీడించు చుండును **- ఐతరీరోపనిషత్తు**



5

## ముక్తి లేక మోక్షము

1) కృత, త్రేతా, ద్వాపర, కలియుగములలో మోక్ష నిమిత్తము కృతయుగమున సత్య, జ్ఞాన, దయాదులను, త్రేతాయుగమున తపోధ్యాన యోగాదులను, ద్వాపరమున యజ్ఞ, దాన జపార్చనాదులను, కలియుగమున భక్తి, దాన, పుణ్య కర్మాదులను విధింపబడినవి. **– మళయాళ స్వాములవారు**

2) ఈ సమస్త క్రియలను అయస్కాంతమువలె సన్నిధి మాత్రముచే నేను చేయుచున్నాను. నాకు ఇందు కర్తృత్వము లేదు అని ఇవ్విధమున వాసనా రహితుడవై కార్యములందు ఎవ్వరు ప్రయత్నించునో అట్టివాడు ముక్తుడని నా అభిప్రాయము.

(బి) భక్తిరహిత కేవల కర్మలచేకాని, పురుష ప్రయత్నముచేకాని మోక్షము పొందబడదు. పరమేశ్వరుని అనుగ్రహము వలననే మనుజులకు పొందదగిన మోక్షాధి ఫలములు లభించును. **– యోగవాశిష్టము**

3) మోహక్షయమే, మోక్షము. **– భగవాన్ సత్యసాయి**

4) ముక్తి అంటే ఏది చేస్తున్నా, ఏది చూస్తున్నా అన్ని వేళల్లో తృప్తికలిగితే అదే ముక్తి. శాంతి ఎప్పుడు అంటే ద్వంద్వాలు సహజమనిపించి నపుడు.

**– జిల్లెలమూడి అమ్మ**

5) సమస్త వాంఛలను భగవత్ పాదారవిందముల ప్రోల

సమర్పించుటయే సర్వోత్తమము. మనకి ఏదిమేలో భగవంతుడే చేయును. భక్తి వైరాగ్యముల నిమ్మని వానిని ప్రార్థింపవచ్చును. ఇవి కోరికలలోనివి కావు. దేవుని కోసము సర్వమూ త్యజించిన వ్యక్తి ప్రత్యక్ష దైవము. దైవ సాక్షాత్కారమునకు తుదకు భగవదనుగ్రహమే కారణమనియు, జప, తప సాధనలన్నియు కేవల మనో నైర్మల్యమునకు తోడ్పడుననియు ఆమె చెప్పెను.

– శారదాదేవి

6) భక్తులకు ఆత్మసాక్షాత్కారము కలిగించుటే యోగుల కర్తవ్యము. అది యోగీశ్వరుడైన సాయి నాథునకు ముఖ్యతమమైనది. తప్పని సరి అయినది. యోగి సంకల్పించనిదే వారిని చూడగలుగు వారెవరు? అతని ఆజ్ఞలేక చెట్టు ఆకు కూడా కదలదు. యోగులందరు ఒకటేయనియు, ఏకాత్మ భావముతో కార్యములొనర్తురనియు తెలియును. – సాయి సచ్చరిత్ర

7) కర్మయొక్క మార్గము చిత్రమైనది. నేనేమీ చేయకున్నను నన్నే సర్వమునకూ కారణ భూతునిగా నెంచదరు. అది అదృష్టమునుపట్టి వచ్చెను. నేను సాక్షీభూతుడను మాత్రమే. చేయువాడు, ప్రేరేపించువాడు దేవుడే. వారు మిక్కిలి దయార్ధ్ర హృదయులు. నేను భగవంతుడనుకాను. ప్రభువునుకాను నేను వారి నమ్మకమైన బంటును. వారినెల్లప్పుడు జ్ఞాపకము చేయుచుండును. ఎవరైతే తమ అహంకారమును ప్రక్కకుతోసి భగవంతునికి నమస్కరించెదరో ఎవరు వారిని పూర్తిగా నమ్మెదరో వారి బంధములూడి మోక్షమును పొందెదరు.

– శిరిడీసాయిబాబా

8) హరినామ స్మరణ, గురునామ స్మరణ కలియుగంలో మోక్షప్రదము

– శిరిడీసాయి బాబా

9) యోగి పుంగవులు మానవులనుద్ధరించే మహనీయ మూర్తులు. మహత్తరమైన వారి శక్తులు భౌతిక వాదులకు మింగుడు పడవు. సామాన్యుల బాహ్యదృష్టికికనిపించని అనేక లోకాలను గోచరింపచేసి ఈశ్వర సాక్షాత్కారానికి దారి చూపుతాయి. – స్వామీ వివేకానంద

## 6

## సిద్ధాంతము లేక మతము

1) దివ్య భావపరవశుడై శ్రీ గురుదేవుడొకనాడు జగన్మాతతో ఇట్లు పలుకు చుండుట వినవచ్చెను ఒకరికి

అమ్మా :- ప్రతి మానవుడును తన గడియారమే సరి అయినదని చెప్పు చుండును. క్రైస్తవులేమి, మహమ్మదీయులేమి, హిందువులేమి ఎల్లరునూ మా మతమే గొప్పదనియు, యదార్థమతమను చుండురు. కాని తల్లీ ! ఎవ్వరి గడియారము సరైన కాలము తెలుపదు. నీ తత్వమును ఎవ్వరు గ్రహింపగలరు? కాని పరితాపముతో నిన్ను వెదుకువారు ఏమతము నవలబించినను, ఏ మార్గమును అనుసరించినను నీ కృపవల్ల నిన్ను జేరును – **రామకృష్ణ పరమహంస**

2) అద్వైతం : (ఆదిశంకరులు) సర్వేశ్వరుడు సర్వాంతర్యామి అయినా సాధనోపచారములు లేకుండా మానవులలో హితం చేయజాలడు. నువ్వులలో నూనె, పెరుగులో వెన్న, భూమిలో నీరు, కట్టెలో నిప్పు, కలిసి యుండునటుల సర్వాంతర్యామి మానవుల శరీరాలలోనూ, మనస్సులలోనూ, కలిసియున్నాడు. వాటిని వేరు చేయాలంటే ప్రయత్నం, సాధనా చెయ్యాలి అప్పుడు ఆరెండిటికి అభేదత్వం, అద్వైతం తెలుస్తుంది. అదే మోక్షం. ఈ జగత్తునకు భగవంతుడే ఉపాదాన కారణమును, నిమిత్త కారణమును. కావున భగవంతుడే యావత్. జ్జగద్వ్యాపము నొందినాడు. యిది పరమ సత్యం. వెలుగు నేనే (I am the Light)

3) విశిష్టాద్వైతం (రామనుజుడు) నేను వెలుగులో ఉంటున్నాను. (I am in the Light) జీవుడు శరీరానికి ఆత్మ. అలాగే దేవుడు జీవునకు ఆత్మ. అలా భావించి ఉపాసించుటే రామానుజాచార్యుల విశిష్టాద్వైతోపాసనము. ఈ సమస్త భూత జాలము ఎవనిలో నున్నాయొ, ఎవ్వరు ఈ సమస్తానికి అంతర్యామిగా వ్యాపించివున్నారో ఆ పరమ పురుష పరమాత్మ అనన్య భక్తి ప్రపత్తితోనే లభ్యమగుతారు. అని పరజ్ఞాన ప్రపత్తి పూర్వకంగా పరమ పురుషోపాసన చేయుటయే విశిష్టాద్వైతం. "త్వమేవ సర్వం మమదేవ దేవ" - నీవే నాగతి, పతి అనే అనన్య భావంతో ఉపాసించుటే. ఇది భగవదాత్మచే అంతర్నిబిడమై యుండు ఒక సంఘటనము. వెలుగునాలో ఉన్నది (the light is in me)

4) ద్వైతోపాసన :- (మధ్వాచార్యులు) పతి, పత్ని సంబంధమే, జీవాత్మ పరమాత్మ సంబంధము కూడా. అవ్యయుడైన విష్ణు భగవానుని భర్తగా ద్వైత భావంతో ఉపాసించుట. – **భగవాన్ శ్రీ సత్యసాయిబాబా**

ద్వైత మత ప్రకారము ఈ జగత్తు భగవంతుడు సాగించిన ఒక మహామంత్ర తుల్యమైనది

"నేను వెలుగులో వుంటున్నాను" (I am in the light)

5) అవస్థలలో బాల్య, యవ్వన, కౌమార వృద్ధాప్యములు ఏ విధముగ ఒక దానిలో ఒకటి ఇమిడి యున్నవో మొదట అవి మన కంటికి కనిపించక అనుభవమునకురాక, ఆయా సమయమున మాత్రమే అవి మనకు అనుభూతికి గుర్తించ వీలగు చుండునో అటులనే ద్వైత, విశిష్ట, అద్వైతములు, మూడూను ఒకదానిలో ఒకటి అంతర్భూతమై యున్నవి. అవి అన్నియు ఒకేసారి గుర్తించ వీలుకాదు. అనుభూతికిరావు. ఆయా సమయమున మన సాధన, అనుభూతులను ఆధారము చేసుకొని గుర్తునకు వచ్చును

– భగవాన్ సత్యసాయి

## 7

## సాధనా (పరికరములు)

1) ముముక్షువగువాడు మొట్ట మొదట శాస్త్రాభ్యాస, సజ్జన సాంగత్యములచే తన ప్రజ్ఞను (బుద్ధిని) బాగుగా వృద్ధి చేసుకొన వలెను. ఇది యోగము లేక యోగి యొక్క మొదటి భూమిక.

ఇక విచారణ (మననము) అనునది రెండవ భూమిక

అసంగ భావన (అసంగాత్మ భావనారూపమగు నిధిధ్యాసము మూడవ భూమిక

వాసనా విలయరూపమగు "విలాసిని" స్థితి నాలుగవ భూమిక.

శుద్ధ చిన్మయానంద స్థితి ఐదవ భూమిక

సగం నిద్రించి, సగము మేలుకొనియుండు మనుజును వలె (బాహ్యశబ్దాదులను వినుచున్నను నిద్రాసక్తుడై ప్రత్యుత్తరాది వ్యవహార మిచ్చగింపని వానివలె) జీవన్ముక్తుడి భూమికయందు స్థితి కలిగి యుండ వలెను. ఆత్మాను భావ వృత్తిరూపమై, కేవల ఆనందఘనమై సుషుప్తిని బోలినదైనట్టి (విక్షేప రహితమైనట్టి) స్థితి ఆరవ భూమిక ఇది తురీయ స్థితి ఆ తురియావస్థ శమింప (ఆత్మాకార వృత్తియు శమింప) ఇక కేవలము పూర్ణ స్వప్రకాశమగు ఆత్మయే శేషించును. అదియే ముక్తి అట్టి సమ, స్వచ్ఛ, సౌమ్య ఆత్మ స్థితియే ఏడవ భూమిక – యోగవాశిష్ఠము

2) యధాప్రాప్తములగు రస సమూహములను గరిటివలె ఆ స్వాదింపుడు. యధా ప్రాప్తములగు రూప సమూహములను చిత్రమందలి మనుజుని నేత్రమువలె ఇచ్ఛారహితముగను, వాసనావర్జితముగను, అభిమాన శూన్యముగను వీక్షింపుడు. - యోగవాశిష్టము

**3) గ్రంధములు చదువుట వలన ఏమి ప్రయోజనము?**

రమణ భగవాన్ :- ఒక అద్దంలో చూస్తేనే మనగడ్డము పెరిగినట్లు కాన వస్తుంది కదా! ఎన్ని అద్దములలో చూచినా అంతే కాబట్టి అద్దము వెంబడి అద్దములో చూచుటకన్నా మొదటి అద్దములో చూచిన వెంటనే పనిని ప్రారంభించడం తెలివైనపని అని మాటలెన్ని అయినా సత్యము ఒక్కటే.

4) కడతేర్చేది సత్యా చరణమే కాని మాటలుకావు – **జిల్లెలమూడి అమ్మ**

5) నీ (సంసార) యోగక్షేమములు నీవికావని సదా జ్ఞప్తి యందుంచుకొనుము. అవి భగవంతునివి. నీవు వాని సేవకుడవు. వాని ఆజ్ఞలను పరిపాలించుటకై నీ విచ్చటకి వచ్చియున్నావు. ఈ భావన స్థిరమయ్యెనా, నరుడు తనదనుకొనదగిన బాధ్యత ఏమియు వుండదు

**– రామకృష్ణ పరమహంస**

6) ప్రజలలో మెలగునపుడు అందరి యందును నీకు ప్రేమానురాగములుండ వలయును. అంతేగాని ఒకడు క్రైస్తవుడని, మరొకడు హిందువుడని, మహమ్మదీయుడని, ఆకారము నమ్మినవాడని, నిరాకారమును నమ్మని వాడని, ద్వేషింపకుము. భగవానుడు తన్నెంత వరకు గ్రహింప, అనుగ్రహించునో, అంత వరకే మానవుడు వానిని (భగవంతుని) గ్రహింప గలుగుచున్నాడు. హిందువులు ఋషులు అవలంబించిన సనాతన ధర్మము అవలంబించుటయే సర్వోత్తమము **– రామకృష్ణ పరమహంస**

7) బ్రహ్మ సత్యంజగన్మిధ్య :- శ్రవణము, మననము, నిధిధ్యాసము బ్రహ్మమే సత్యము, ప్రపంచమసత్యమని మొదట వినవలయును. పిమ్మట

మననము చేయవలయును. తరువాతిది దానిని గూర్చిన ధ్యానము అనగా మనస్సును అసత్యమగు ప్రపంచము నుండి మరల్చి సత్యమగు బ్రహ్మముపై నిలుప వలయును ఇదే వేదాంత విచార క్రమము. అంతేకాని తత్వమును విని దానిని కేవలము ధీశక్తిచే ఇట్టిదని గ్రహించి అసత్ ప్రపంచమును విడువ యత్నింపని పక్షమున అట్టి జ్ఞానము వలన ఏమి లాభము? అది లౌకికుల ధోరణి

– రామకృష్ణ పరమహంస

8) గురుదేవులు తరచుగాపాడు పాట :-

వెర్రివానిని చెయ్యవే ! నీ ప్రేమలోన పిచ్చివానిని చెయ్యవే !

నన్నుగన్న తల్లి, ఏల జ్ఞానము, ఏల తర్కము,

చాలు చాలివి, ఏలనాకు బాలుడను, నీ ప్రేమమధ్యము,

గ్రోల చేయుము, కొల్ల కొల్లగా, నను తప్ప త్రాంగిపవే ! నీ ప్రేమ మధువు.

– రామకృష్ణ పరమహంస

9) కాయమున్నంత వరకు కర్మ తప్పదు ఈ కర్మ, కాయములు ఆచరించునంత వరకు మన కాలము పవిత్రము చేయక తప్పదు. కాల, కర్మ, కారణ, పవిత్రములు. ఆవిష్కరించుకొనే నిమిత్తము ఈ కాయము ఏర్పడినది అను సత్యమును గుర్తించుట అవసరము. ప్రతీ కార్యమునకు ఒక కారణమున్నది కార్యము ప్రతిబింబము, కారణము బింబము. ఈ బింబ, ప్రతిబింబ, సంబంధము గుర్తించు ప్రయత్నమే ఈ ఆధ్యాత్మిక మార్గము.

10) మనసులో దేనిని ధ్యానించుచుండునో దానిని యిచ్ఛగించును. ఇచ్ఛ ననుసరించి కర్మ చేయును. చేసిన దానిననుసరించి తాను పొందును. పురుషుని వ్యక్తిత్వ స్వరూపము కామమయము. తాను కోరిన ప్రకారము సంకల్పించును. సంకల్పముననురించి కర్మను చేయును. కర్మననుసరించి తాను సృజించుకొనును. అనగా తన బుద్ధిననుసరించి జన్మతెచ్చు కొనును. ఈ బుద్ధినే ప్రకృతియనుట. కనుక ప్రకృతి తన బుద్ధి నిర్మాతయని తెలుసుకొనుము.

– భగవాన్ సత్యసాయి

11) పుణ్యఫలము నాకు కావాలని ఆశింతురు. కాని పుణ్యకార్యము చేయుటకు పూనుకొనరు. పాప ఫలము నాకు అక్కరలేదని అందురుగాని పాపకార్యము చేయుటకు పూనుకొందురు. దీనికి అంతర్భూతమైన ప్రేరణ ఏది? – భగవాన్ సత్యసాయి

12) ప్రశ్న :- **అమ్మా! మేము మాంసాహారులము. మరి హింస పాపం కదా? మేమేమి చెయ్యాలంటారు? అదీగాక ఆహారం కోసము చేసేది కొందరు హింస అంటారు. కొందరు కాదంటారు. ఏది నిజము?**

అమ్మ :- హింస అంటే సహించలేనిదే. నాన్నా - మేకలను కోసేవాడు ఆవులను నరకటం సహించలేడు. కోళ్ళను కోసేవాడు గొర్రెలను చంపటం చూడలేడు. సర్వము ప్రాణమయమే. అనుకున్నప్పుడు అన్నం తినటమూ, కూరగాయలను, మంచి నీళ్ళు త్రాగటము, కూడా హింసే కనుక ఏది హింస, ఏది కాదు అన్నది సమస్య కాదు. ఎవరు ఏది సహించలేరో అదే హింస కాబట్టి దానిని మానుకుంటే సరిపోతుంది. అది మానుకోగలిగితే. **– జిల్లెలమూడి అమ్మ**

13) ఆచారం :- ఆ చారమంటే ఆచరించటమేనని నాయుద్దేశ్యం. నా దృష్టిలో (స్నానమే చెయ్యాలి అన్న నియము) ఇలాంటి వేమీ వుండదు. చెయ్యటం ప్రధానంగాని ఇన్నికావు. సందేహమే అనాచారము. శ్రద్ధా, భక్తులతో పాకీదొడ్లో చేస్తే మటుకుఏం? నా దృష్టిలో ఎక్కడున్నా ఒకటే. చెయ్యటము ప్రధానము. పాయిఖానా దొడ్డి వేరైంది కాని అది మనకడుపులోదేగా శ్రద్ధా, భక్తి కంటె ఆచారమేముంది?

14. సాధన :- సాధన చెయ్యటం కూడా మన చేతిలో లేదు. ఒడ్డున కూర్చొని కబుర్లు చెప్పడానికేం. ఇది చెయ్యండి, అది చెయ్యండి అని. ఏదీ మన చేతిలో లేదు. తరుణంవచ్చినపుడు అదే అవుతంది.

సాధన చెయ్యాలంటారు. చెప్పేవాడికది సాధ్యమైంది (చెప్పాడు) కదా! వినేవాడికి అది సాధ్యమయింది. తలూపేడు. ప్రయత్నం చెయ్యమంటే ఎట్లా ప్రయత్నం చేస్తాడు? ప్రేరణ లేనిదే ప్రయత్నం ఎక్కడ నుండి వస్తుంది?

సాధ్యమయిన దానినే సాధించడము జరుగుతుంది. కాని సాధన చేసి సాధిస్తారన్నది కాదుజరిగేది.సాధిస్తే సాధ్యమైనది అనేది వాడుకపదము.

15. నీకు ఏదితోస్తె అది చెయ్యమంటాను. నువ్వు చేసేది, చెయ్యగలిగేది - ఏమీ లేదంటాను. నువ్వు చేసేదేమీ లేదంటే నీకు నిస్పృహ కలగవచ్చు. అమ్మ ఇట్లా చెప్పతుందేమిటి అని? కాళ్ళుముడుచుకుని కోర్చోమంటుంది - అనుకోవచ్చును. నేను చెయ్యమన్న సాధన నీవు ఏటూ చేయలేవు. జపం చెయ్యి, యోగంలో ముక్కుబిగించుకు కూర్చొని కూర్చుమంటే - నువ్వు ఏటూ చేయలేవు. అందుకే నీకు ఏది చెయ్యాలనిపిస్తే అది చెయ్యి అంటాను. ఏ సాధన గొప్పది అంటే ఒక సాధన గొప్పదని, ఒకసాధన తక్కువనీ - నాకు లేదు. కాని ఆ సాధన నీవు చెయ్యగలగాలి. మనం చేసేది ఏమీ లేదని నా ఉద్దేశ్యం. శాస్త్రం చదువుతాం. శాస్త్రం చదివేనూ, చదివినట్లు చెయ్యలేకపోయాను, అనేదే మిగులుతుంది. ప్రతివాళ్ళు సాధన అవసరం అని చెపుతారు. వారు చెప్పేదాంట్లో కర్త చేయించేది అర్థం కావడంలేదు - కర్మ అర్థమవుతుంది.

**– జిల్లెలమూడి అమ్మ**

16) అందరికి తెలియటమే తోస్తున్నది కాని, ఎవరు చేస్తున్నది తెలియుట లేదు. చేద్దాము అనుకున్నది ప్రేరణ. చేసింది క్రియ. క్రియ మనదిగా కనిపిస్తున్నది. కర్త ఎవరో తెలియుట లేదు. కర్త ఎవరో క్రియ వారిదే అనిపిస్తున్నది నాకు. తోచిందేదో చెయ్యి. తోపింప చేసేవాడు వాడేగా.

అవకాశాన్ని గమనించడం సాధన. సాధన అంటే తాను చేస్తున్నానను కోవటమే **– జిల్లెలమూడి అమ్మ**

17) నాచేత ఈ పని (వాడు) చేయిస్తున్నాడు అనుకున్నప్పుడు అదే సాధన - అదే యోగం - అదే తపస్సు అవుతుంది. **– జిల్లెలమూడి అమ్మ**

18) వైదిక కర్మలన్ని ఇంద్రియ పరవశులైన వారికి ఇహపర సుఖప్రాప్తియను ఆశను చూపించి, కొసకు యోగ మార్గానికి మళ్ళించటానికే

ఉపయోగింప బడ్డాయని, ఫలాసక్తి వున్న వారికి తాత్కాలిక ఫలాన్ని ముందుగా చూపి, శాశ్వత ఫలంవైపునకు ఆకర్షించటమే వాటి ధ్యేయమని, నివృత్తి ధర్మాన్ని ఉపదేశించి, సాధకులను ముక్త సంగులునుగా తీర్చిదిద్ది ఆత్యంతిక క్షేమాన్ని ప్రసాదించటమే వేద తాత్పర్యమని నిర్ధారింప బడింది. (భాగవతం)

19) నారద, బ్రహ్మ సంవాద సారాంశము.

1) మోక్షమంటే శాశ్వత సుఖానుభవము, (2) ఆసుఖం నిరతిశయమైన ఆనంద రూపంలో కలుగుతుంది. (3) ఆ మోక్షం భగవదనుగ్రహం (4) భగవదనుగ్రహాన్ని పొందడానికి భక్తి ఒక్కటే పరమ సాధనం. (5) ఆ భక్తి నిరపాయం కావాలంటే శ్రద్ధ వుండాలి. (6) శ్రద్ధా భక్తులు కలగాలంటే భగవంతుని యెడ ప్రీతి జనించాలి (7) అట్టి ప్రీతి జనించడానికి ఆయన గుణాలు రుచించాలి (8) అటువంటి రుచి కలగాలంటే భగవంతుని చరిత్రలను చదవాలి. (9) భగవత్ చరిత్రలను శ్రద్ధా పూర్వకంగా ప్రతినిత్యం, విన్నా, చదివినా, భగవదనుగ్రహం కలుగుతుంది. (10) ఆ అనుగ్రహ ఫలంగా భగవంతుడు భక్తుని అంతఃకరణలో అడుగు పెడతాడు. (11) భగవత్ ప్రవేశంతో అంతఃకరణంలోని మలినాలన్ని నశిస్తాయి (12) తత్ఫలంగా చిత్తశుద్ధి కలుగుతుంది (13) శుద్ధ చిత్తుడు దేహ సంబంధాలైన దారపుత్రాది భోగాలను నిరసించి సర్వక్లేశాలకు అతీతుడై భగవత్ పాద మూలాన్ని చేరి అదే తనకు పరమ నివాస స్థానమని తెలుసుకొని అందే నిలిచి వుంటాడు (14) ఆ విధంగా భగవత్ పాదమూలాన్ని చేరిన వారికి వర్ణాశ్రమాచారలతో కాని, తపో దాన ధర్మాలతోకాని, వేద శాస్త్రాధ్యయనాలతోకాని, ఎటువంటి ప్రయోజనము వుండదు - భాగవతం

20) బ్రహ్మార్పణం బ్రహ్మహవిహి అన్నట్లు సర్వయాగాలనువాటి అంగ కల్పనలను భగవత్ దృష్టితో చేయాలి భిన్న దృష్టితొ ఎంత మాత్రము చేయకూడదు. యాగాలు, యజ్ఞంగాలు మాత్రమే కాదు, యాగ ఫలం కూడా భగవత్ రూపమే. - భగవతం

ముక్తి సాధనం :- ఆత్మకన్నా ప్రియమైనది లేదు. ఇతరములన్నియు ఆత్మార్థమే ప్రియమవుతున్నాయి. ఆత్మకు ప్రియమైనప్పుడు సర్వలోక ప్రీతి కలుగుతుంది. వృక్షమూలల్లో నీరు పోసినపుడు దాని శాఖోపశాఖలకు పత్ర పుష్ప, ఫలాదులకు అన్నిటికి తృప్తి కలుగుతున్నది కదా! భోజనం చేసినప్పుడు సర్వేంద్రియాలకు తృప్తి కలుగుతున్నది కదా ! భగవదారాధన వల్ల సర్వలోక సంతృప్తి కలుగుతుంది. ఆ విధంగా చేయక ఒకొక్క కొమ్మ దగ్గర నీరుంచినా, ఒకొక్క అవయువానికి తృప్తి కలుగజేసినా సర్వ వృక్ష ప్రీతికాని, సర్వేంద్రియ ప్రీతికాని ఏవిధంగా కానేరదో అలాగే భగవంతుని వదలి ఇతర దేవతలను అరాధించినపుడు తత్త దేవతలకు ప్రియమవుతుందే కాని సర్వాత్మకునకు ప్రీతి కలగదు. – భాగవతం

21) యజ్ఞము, దానము, తపము, మున్నగు కర్మలు విడువ తగినవి కావు అవన్నియు మానవులకు కర్తవ్య కార్యములు, సత్వ సంసుద్ధికి ఉపాయ రూపములుగా వానిని బద్ధ జీవుడు ఆచరించును – భగవద్గీత

22) అధిష్టాన మనగా దేహము. కర్త అనగా చిజ్జడగ్రంధి రూపమగు అహంకారము. కరణమనగా ఇంద్రియములు, బహువిధములగు చేష్టలు, మరియు దైవమనగా జగత్ వ్యాపారము. నియామకుని యొక్క సహాయము అను ఈ ఐదును కారణములు. ఈ కారణములు లేకుండా ఎట్టి కర్మము ఆచరింప బడదు.

(2) మనో వాక్కాయ కర్మలచే మనుష్యుడు ఏకార్యము చేయబూనినను, అది న్యాయమగు కర్మమేకాని; అన్యాయ కార్యమేకాని, పైన చెప్పిన ఐదు విధములగు కారణముల చేతనే అది చేయబడుచున్నది – భగవద్గీత

(3) వాస్తవ స్థితి ఇట్లుండగ తానే కేవల కర్తగా ఎవడు తనను గూర్చి భావించెనో అట్టివాడు బుద్ధి సంస్కారములేని దుర్మతి అగుచున్నాడు. వానికి సత్వము తెలియదు.

(4) స్నానము, భోజనము, మున్నగు దేహ సంబంధములైన వ్యాపారములనే మహత్కార్యములుగా భావించుచు ఎవడు వానియందు అనురక్తుడు అగునో అట్టివాని జ్ఞానము అల్పము, తామసము అగుచున్నది.

– భాగవద్గీత

23) ఎవరైతే ఇతరులను నిందించెదరో వారు నన్ను హింసించిన వారగుదురు, ఎవరైతే బాధలను అనుభవించెదరో, ఓర్చుకుందురో వారు నాకు ప్రీతి కూర్చెదరు. – షిర్డీసాయి బాబా

24) ఏది చదివిన ఆచరించే వాడికి ఏదైనా ఒకటే. ఆచరించలేని వాడే - దానిలో ఏముంది, దీనిలో ఏముంది అని వెతుకుతూ వుంటాడు. కాని చివరకు వెతకటంలోనే సరిపోతుంది (ఆ జీవితం) – జిల్లెలమూడి అమ్మ



## 8

## కర్మము

1) ఓ రామచంద్రా! కర్మాను సారముగ దేహము ఏర్పడుట వలన కర్మమే దేహము. ఆ దేహమే చిత్తము. ఆచిత్తమే జీవుడు. ఆ జీవుడే శివ (మంగళ) స్వరూపమై, చిద్రూపమైనట్టి ఆత్మయు, ఈశ్వరుడై వున్నాడు. ఈ ప్రకారముగా సకల శాస్త్రముల యొక్క రహస్యమును ఒక్క మాటలో సంక్షేపించి నీకు చెప్పితిని — **యోగవాశిష్ఠము**

2) కర్మ జడము. చైతన్య స్వరూపుడైన ఈశ్వరాజ్ఞ చేతనే నీ కర్మ పలాన్ని అనుభవిస్తున్నావు. అంటే నీ చేతులతో నీవే చేసుకుంటున్నావు. భగవంతునకు ఏమీ సంబంధము లేదు అనే మాటను త్రోసి పుచ్చారు. అది అవివేకం అన్నారు. — **భగవాన్ రమణ మహర్షి**

**3) కొంతమనం చేసుకునే పనులలో వుంది - అంటారుగదమ్మా?**

అమ్మ ఉవాచ :- వీళ్ళ పనుల్లోనే వుండేటట్టయితే సుఖపడే పనులే చేసుకునే బుద్ధి ఎందుకు పుట్టదు? అనుభవించే యోగ్యత వున్నప్పుడు అది బాధకాని, సుఖంగాని తెలుసుకోకుండా తన చేతులతో తాను చేసుకోవడం జరుగుతుంది. తెలిసిన వాడికి (జ్ఞానికి) తన ఇష్టప్రకారం జరుగదు. తెలియని వాడికి తన ఇష్ట ప్రకారం జరుగదు, — **జిల్లెలమూడి అమ్మ**

4) ఏమైనను నిష్కామకర్మ ఈ కలియుగమున ముఖ్యముగ దుస్సాధ్యము కావున శ్రద్ధా, భక్తులతో భగవంతుని ప్రార్థించుటయే కర్మ యోగము కంటెను, జ్ఞాన యోగము కంటెను, భగవదను సంధానమునకు ఎక్కువగా తగియున్నది. అయినను కర్మను ఎవ్వడు తప్పించుకొన జాలడు. మనో వ్యాపార మంతయు కర్మమే "నేను అనుభవించు చున్నాను. లేక నేను తలచుచున్నాను" అను భావన కూడా కర్మమే. కర్మయుక్తమగు భక్తియోగం అనగా భగవత్ భక్తిచే కర్మము. క్షీణించు చున్నదన్నమాట. గమ్యమనగా భగవంతునియందు మనస్సు నిలుపుటచే కర్మము క్షీణించునని మొదట మనము గుర్తిపవలసి యున్నది. రెండవది నిష్కామ కర్మా చరణమునకు ఇది తోడ్పడును. భగవంతుని భజించుచున్నచో సిరి సంపదలయందును, భోగ భాగ్యముల యందును, పేరు ప్రతిష్ఠల యందును, అధికారమునందును, ఎవ్వడు అనురక్తి కాజాలడు. మేలైన కలకండ పానకమును ఒకసారి రుచి చూచినవాడు బెల్లపు నీళ్ళకై దేవులాడ జాలడు. **- రామకృష్ణ పరమహంస**

5) ఈ కలియుగమునకు నారదీయ భక్తి అనగా శ్రద్ధా, భక్తి ఆత్మార్పణము - వీని మూలమున నారద మహర్షి అనుష్టాన పూర్వకముగా బోధించిన భగవదను సంధాన మార్గమే తగియున్నది. కర్మ యోగానుష్టానమునకు, అనగా శాస్త్ర విహిత కర్మలనన్నిటిని ఆచరించుటకు తగినంత వ్యవధిలేదు.

**- రామకృష్ణ పరమహంస**

**భగవంతునిపై మనస్సు నిలుపుటకు (సంసారిక) కార్య భారము అడ్డు వచ్చును కాదా?**

గురుదేవుడు ఉవాచ :- అవును. అడ్డువచ్చును నిస్సందేహంగా. కాని జ్ఞాని అగువాడు నిష్కామముగాఆ కర్మమాచరించ వచ్చును అప్పుడు కర్మము వానిని బంధింపజాలదు. హృదయ పూర్వకముగా వాంఛించిన పక్షముగ భగవంతుడే నీకు తోడ్పడును. అప్పుడు కర్మ.బంధము క్రమముగా తొలగి పోవును **- రామకృష్ణ పరమహంస**

6) ప్రకృతి లేక స్వభావమే (కర్మ మొనర్ప) మిమ్ము నియమించుచుండుటచే కర్మమును మీరు విడువ జాలరు. కాబట్టి విద్యుక్త మార్గమున కర్మములను చేయవలయును. నిష్కామ కర్మాచరణము భగవంతుని బొందించును. నిష్కామ కర్మాచరణము అనగా ఇహపరములందు ఎట్టి పలములను ఆశించకుండా కర్మలనాచరించుట. ఇట్టి కర్మాచరణము ప్రాప్యముబొందుట మనకు సాధనము భగవంతుడే మనకు ప్రాప్యుడు.

– రామకృష్ణ పరమహంస

7) కోరికలను విడిచిపెట్టి, చిత్తస్వాధీనత కలిగి ఎల్లవిషయములందభిమానము వదలి శరీర పోషణకు మాత్రము ఉపయుక్తమైన కర్మలను చేయువానిని పాపము అంటదు – భగవద్గీత

8) ఎవ్వడును క్షణమైన ఎప్పుడును కర్మమును చేయక యుండజాలడు ఏలన ప్రకృతి జన్యములగు సత్వ రజస్తమో గుణములు వానిచే కర్మములను చేయింపక విడువవు – భగవద్గీత

9) హృదయమున భగవత్ భక్తి వెల్లివిరియగనే కర్మత్యాగము దానంతట అదియే సిద్ధించును. ఎవరిని విధాత కర్మములను చేయ నియమించి యున్నాడో వారు కర్మములను చేయుచుందురు గాక? కాల పరిపాకమున నరుడు సమస్తము పరిత్యజించి ఇట్లు పలుకగలడు. ఓ మనసా! రమ్ము! హృదయ సింహాసమున అధిష్టించియున్న పరమేశ్వరుని వీక్షింతము.

– రామకృష్ణ పరమహంస

10) పరమేశ్వరుని జ్ఞానేచ్ఛ క్రియాశక్తులే స్పందనము. ఆ స్పందనమునే కర్మయని చెప్పబడును. సృష్టికిని, కర్మకును, అవినాభావ సంబంధము కలవు. ఈ కర్మ ప్రభావము వలననే బ్రహ్మ, విష్ణు, మహేశ్వర స్వరూపులు సృష్టి, స్థితి, లయకారులగుట తటస్థించుచున్నది. సమస్త గ్రహ సంచలనములు, తదితరలోక వ్యవహారములన్నియు, కర్మకులోనై జరుగుచున్నది. కర్మకు మొదలు అనునదిలేదు. ఏది, ఎందులకు, ఎప్పుడు, ఏవిధముగ జరుగ

బోవుననను అంశము చెప్పుట ఎవ్వరికిని సాధ్యంకాదు. ఇది అనాధి సిద్ధమై జరుగుచు వచ్చుచున్నది. ఉచ్ఛ్వాస, నిశ్వాసము, ప్రాణ స్పందనము. ఇది జీవితమున మొట్ట మొదటి క్రియ. తాను ఉచ్ఛ్వాస, నిశ్వాసములు చేయవలెనని ఏమానవుడు సంకల్పించి చేయుటలేదు. ఈ కార్యము సంకల్పరహితముగా జరుగుచున్నది. ఇది సర్వజీవరాసులయందు జరుగుచున్నది. -**భగవాన్ సత్యసాయి**

11) తెలిసి చేసినా, తెలియక చేసినా, చేసిన కర్మకు (పనికి) ప్రతిపలము అనుభవించక తప్పదు. ప్రతి కర్మకు ప్రతిఫలము, ధ్వనికి ప్రతిధ్వని బింబానికి ప్రతిబింబం వుండక తప్పదు.

ఉదాహరణ :- దశరధుడు వేటకై వెళ్ళి మునికుమారుని తన శబ్ధ భేధి ద్వారా బాణము వదలి చంపుట మునిశాసము "నీవు కూడా అంత్యకాలములో నావలె కుమారుని చింతతో మరణిస్తావని" – **భగవాన్ సత్యసాయి**

12) <u>ప్రారబ్ధము</u> :- అర్హత అన్నది నీది కాదుగా ! నీకే అర్హత ఇచ్చాడో అదే అనుభవించాలి. ప్రారబ్ధము భగవంతుడు. మొట్ట మొదటి జన్మలో వీడికి ప్రారబ్ధము లేదుగా అసలు! వాడు ఇచ్చింది వీడు చేస్తున్నాడు. తను ఇచ్చింది వీడు చేస్తున్నాడు. మరి ప్రారబ్ధము ఇచ్చింది వాడేగా! ఎవ్వరికి ఏరూపంగా ఇచ్చినా ఇచ్చేది ఒక్కడే. అందరికి తలొరకంగా – **జిల్లెలమూడి అమ్మ**

13) పుణ్యమొస్తుందని చెయ్యమన్న పనులు చేయగలవా? నరకమొచ్చినా పరవాలేదు అని చంపమంటే చంపగలవా? చెయ్యలేవు. అన్నీ ఆ కర్మే చేయిస్తుంది. నీలో దృఢ విశ్వాసమున్నప్పుడు నువ్వు నమ్మిన శక్తే - మంచికాని, చెడుకాని అన్నీ చేయిస్తుంది అనుకుంటావు. ఆ కర్మ కూడా ఆ శక్తిదేగా ! ఈ సర్వము ఒకే శక్తిచే నడిపింప బడుతున్నప్పుడు కర్మవేరు శక్తివేరు కాదుగా! పురుష కారము, దైవ సహాయము - రెండూ ఒక దానివే.

– **జిల్లెలమూడి అమ్మ**

**14) కొందరికి కష్టాలు, కొందరికి సుఖాలు ఎందుకున్నాయి?**

అమ్మ ఉవాచ :- చెట్టుకు తీగలు అల్లుకున్నాయి. ఆకు అడ్డుతో మచ్చ వస్తుంది. అట్లా అడ్డు రావడానికి కారణం? శక్తో, లేక దైవమో కారణం, దైవం కారణంకాదు. మనమే కారణం అని కూడా అనుకోవచ్చును. మనమే కారణం అనుకుంటే మన ఇష్టానుసారం అన్నీ చేసుకోవచ్చుగా! పూర్వ జన్మకు, కర్మకు, ఏదీ సమాధానం దొరకక సర్వానికి ఒకే కారణం అనుకున్నాను. నేచరు ఏర్పడే వున్నది. కొత్తగా రావటం కాదు. జన్మలు లేవు. జన్మే సముద్రములోని అలలుగా. **– జిల్లెలమూడి అమ్మ**

15) అమ్మ :- వాడిని తెలుసుకోవాలని, తరించాలని, పుట్టిందే అందుకని అంటారు కదా! నేను పుట్టిందే అందుకైతే నేనే కనుక్కొంటాను. వాళ్ళ సిద్ధాంతరిత్యా కర్మతోనే జన్మ వచ్చినపుడు కర్మప్రకారమే నీ జన్మ నడుస్తుంది. బుద్ధిః కర్మానుసారిణి అన్నప్పుడు బుద్ధికి విలువలేదు. బుద్ధి కర్మాను సారిణి అయింది కదా! మనయేవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయో! అనే వాళ్ళ దృష్టి ప్రకారముగా మనస్సుదాని మీద లేదు.

జాయసే కర్మనస్యామత బుద్ధి జనార్ధనా! అనేదాని ప్రకారము ఆ విధంగా కూడా వీల్లేదు. నీవు పుట్టటమే కర్మచేత పుట్టావు. ఆ కర్మ ప్రకారమే నీవున్నావు. ఏరకంగా చూచినా మనిషికి స్వతంత్రత లేదు. **– జిల్లెలమూడి అమ్మ**

16) భగవానుడు సర్వదేవతలకు పరదేవత. ఆ పరమేశ్వరుని నిష్కామ బుద్ధితో భావించి స్వధర్మాలను ఆచరించి ఆత్మార్థం కొరుకొనక ఫలాన్ని భగవదర్పితం కావిస్తే, ఆ కర్మవల్ల జనించే ఫలం చిత్త శుద్ధికరమై తుదకు ముక్తిదాయకం అవుతుంది. కర్మ రహస్యం ఇదే కాబట్టి ఎవరు ఎటువంటి కర్మను ఆచరించినా తత్ కర్మ దేవతను పరిచ్ఛిన్న భావంతో ఆరాధింపక పరమేశ్వర విరాడ్రూపాన్ని అనుసంధించి తదేక ధ్యానంతో విహిత కర్మను నెరవేర్చాలి. అప్పుడు చిత్తశుద్ధి జనిస్తుంది. శుద్ధ చిత్తుని హృదయాకాశంలో భగవానుడు ప్రకాశిస్తాడు. **– భాగవతం**

17) జీవులు స్వాభావిక గుణ బలాలకు చిక్కి స్వాతంత్ర హీనులగుతారు. అంతేకాక వారికి వారి కర్మ ఫలానుభవానికి యోగ్యమైన స్థూల, సూక్ష్మ శరీరాలు స్వత: సిద్ధంగా సమకూరుతాయి. కాబట్టి శరీరం వున్నంతకాలం దాని స్వభావం తప్పదు. స్వభావం వున్నంతకాలం అది వ్యవహరింపక మానదు. ఆ వ్యవహారాలనే కర్మములు అంటున్నాము. దీనిని బట్టి జీవరాశికి కర్మము నైజమని తెలుస్తున్నది. - భాగవతం

18) కర్మ వైషమ్యానికి కారణం గుణ వైషమ్యమే. గుణములు సత్వరజస్తమములు. ఏ గుణం ప్రకాశించినపుడు కర్మము జరుగుతుందో ఆ కర్మము తత్‌గుణాత్మకమై, తత్ ద్రూపఫలాన్ని ఇస్తుంది. దాని వలన కర్మ వైషమ్యం, ఫల వైషమ్యం కలుగుతాయి. - భాగవతం

19) సృష్టి కావించే వ్యాపృతిని కర్మము అంటారు. ఈ కర్మము మొట్ట మొదట బ్రహ్మము నుంచే ప్రారంభమయింది - భగవద్గీత

**ఎప్పుడు ప్రారంభమయింది?** అంటే సంకల్పంతో పాటే కర్మము ప్రారంభమయింది. సంకల్పం ఎప్పుడు కలిగిందో చెప్పసాధ్యంకాదు. ఈ వ్యాపారం ప్రవృత్తి పరమైనప్పుడు జనన మరణ రూప సంసారం ఫలం అవుతున్నది. నివృత్తి పరమైనప్పుడు మోక్షము ఫలమవుతున్నది. ఈ వ్యాపృత్తిని ప్రవృత్తి పరంనుంచి, నివృత్తి పరం చేయడానికి జ్ఞానమే సాధనం. ప్రవృత్తి పరమంటే సకామ వ్యాపారం. నివృత్తి పరమైనది నిష్కామ వ్యాపారం. ఈ మార్పును క్రమంగా తీసుకురావాలి. పూర్తిగా కర్మలను మానుకోవడం ఎవరికీ సాధ్యంకాదు (గీత) జగత్ చక్రమంతా కర్మము వలననే నడుస్తున్నది.

- భాగవతం

20) యజ్ఞార్థమై (పరమేశ్వరార్పణ బుద్ధితో) భగవత్ ప్రీతి కరములైన కర్మలు తప్ప మిగిలిన కర్మములు కర్తకు బంధకారణములే అగుచున్నవి. కావున నీవు ఫలాపేక్ష రహితుడవై భగవత్ ప్రీతి కరములైన కర్మములను భగవదర్పిత బుద్ధితో ఆచరింపుము. - భగవద్గీత

21) బ్రహ్మము నుండి కర్మ ఉత్పన్న మగుచున్నది. అక్షరుని నుండి (అనగా అత్యుతుని నుండి) బ్రహ్మ రూపమగు వేదముద్భవించు చున్నది. యజ్ఞమునందే సర్వగతమగు బ్రహ్మ నిత్య ప్రతిష్టమగు చున్నది. - **భగవద్గీత**

22) ఓ పార్థా ! నేను పరమేశ్వరుడను. ఈ మూడు లోకముల యందును నేను చేయవలసిన కర్మ మెద్ధియును లేదు ఐనను నేను కర్మను నాచరించు చున్నాను. (అంటే నేను నిర్వ్యాపారిని కాని వ్యాపారిని కూడా)

**- భగవద్గీత**

23) దేహేంద్రియాది రూపమున పరిణామము పొందిన ప్రకృతియే సమస్త కర్మల నొనర్చుచున్నది. శుద్ధాత్మ స్వరూపుడనగునేనెద్ధియు చేయలేదనుచు ఎవడు తెలుసుకొనుచున్నాడో అట్టివాడు సమస్త కర్మలను నొనర్చుచున్నను 'తనను అకర్తను గనే" తెలుసు కొనుచున్నాడు - **భగవద్గీత**

24) ఉత్తమ సిద్ధాంతమేమనిన ఆ సక్తియు, ఫలమును విడిచి ఈ కర్మలన్నిటిని కర్తవ్య బుద్ధితో ఆచరించుటయే ఆవశ్యకము - **భగవద్గీత**

25) తిధులు విధిని మార్చలేవు - **జిల్లెలమూడి అమ్మ**



# 9

## కర్తృత్వము

1) ఓ రామచంద్రా ! వాస్తవముగా నీవు కర్తవు కావు. ఈ క్రియలందు నీకు మమత్వమేల? ఒకే అద్వితీయ పరమాత్మ వస్తువు ఉండియుండ ఇక ఏది, ఎట్లు, ఎవనిచే చంపబడ గలదు? **– యోగవాశిష్ఠం**

2) నీవెంతగా ప్రయత్నించినను భగవదనుగ్రహము లేనిదే ఏమియు లభింపదు. వాని కృపలేనిదే నీవు వాని సాక్షాత్కారమును బొందలేవు. కాని భగవత్ కృప సులభముగా చేజిక్కు నది కాదు. హృదయము నుండి అహంకారమును పూర్తిగా నిర్మూలనము చేయవలయును. నేను కర్తను అను అహంకారము ఏ మాత్ర మున్నను నీవు భగవంతుని కనజాలవు

**– రామకృష్ణ పరమహంస**

3) గొప్ప కార్యం చేసినా, కొద్దికార్యం చేసినా ఒకటే. నడిపించేది ఒకటైనపుడు నీ గొప్పతనంలేదు (జిల్లెలమూడి అమ్మ)

4) ప్రశ్న :– కర్మకు **ఆధారము ఏమిటి?**

**కర్త. అయితే మానవుడు చేసే దుష్కర్మ, సత్కర్మలకు ప్రేరణ ఇచ్చేది కర్తే అంటారా?**

అమ్మ :- అవును. కర్త ప్రేరణ వల్లనే.

ప్రశ్న :- **అమ్మా! కొందరికి బాధాపూరితమైన జీవితాన్ని ప్రసాదిస్తావు. మరికొందరికి సుఖప్రదమైనజీవితాన్ని యిస్తావు. నీకు నిజంగా పక్షపాతం వున్నదమ్మా?**

అమ్మ :- అవసరము విలువైనది నాన్నా? పూలు మాలగా కావాలను కుంటున్నాను. కనుక దారంతో బిగించక తప్పదు. మాలను ధరించాలను కుంటున్నాను. కనుక బిగిస్తున్నాను. **– జిల్లెలమూడి అమ్మ**

5) ప్రశ్న :- **తెలిసి తప్పెందుకు చేస్తాము?**

అమ్మ :- తప్పు అని తెలిసి, తప్పించు కోలేక తప్పని సరై తప్పు చేస్తావు. ప్రత్యేకించి వేరే కారణము లేదు. నీవు కారణం కాదు. నీవు చేయడమే లేదు. కాలమే కాని నీవు కారణము కాదు. కాలమంటే దైవమనే నీకు కర్తృత్వము లేదు. దైవమే కారణము. **– జిల్లెలమూడి అమ్మ**

6) శ్రీ తెంబేస్వామి షిరిడీ వెళ్ళుచున్న పుండలీకరావునకు ఒక కొబ్బరికాయ ఇచ్చి దీనిని తన సోదరుడగు సాయినాథునకు ఇమ్మనిరి. కాని దారిలో తమ ఆకలి తీర్చుకొనుటకు ఆ టెంకాయను పగుల కొట్టిరి బాబాకుఅందచేయకుండ. కాని పుండలీకరావు తన తప్పును తెలుసు కొని పశ్చాత్తాప పడుచు బాబాను క్షమాపణ వేడెను. అప్పుడు బాబా ఇట్లనిరి.

"ఆ విషయమై నీవేమాత్రము చింతింప నవసరము లేదు. అది నా సంకల్పము ప్రకారము నీకివ్వబడినది. తుదకు దారిలో పగులగొట్ట బడెను (నా సంకల్ప ప్రకారము) దానికి నీవే కర్తవని అనుకొననేలా? మంచికాని, చెడ్డకాని, చేయుటకు నీవు కర్తవని అనుకొనరాదు. గర్వాంధకార రహితుడవై యుండుము. అప్పుడే నీ పరచింతన యభివృద్ధి పొందును".

**– షిరిడీ సాయిబాబా**

7) జడీయ కార్య కారణ కర్తృత్వములు ప్రకృతి ధర్మములు. కావున ప్రకృతియే వానికి హేతువగుచున్నది. పురుషుని తటస్థ స్వభావముచే కలిగిన

జడాభిమానము నుండియే వానికి సుఖ, దుఃఖ భోక్తృత్వము కలుగుచున్నది.
– భగవద్గీత

8) ప్రకృతి, పురుషుడు – ఈ రెంటిని నిత్యములని తెలియుము. దేవేంద్రియాది వికారములను, గుణ పరిమితములగు సుఖ, దుఃఖములు, మోహాదులును, ప్రకృతి సంబంధములని తెలియును – భగవద్గీత

9) ఎవ్వడు ఈ విధముగా నిర్గుణ పురుష తత్వమును, సగుణ ప్రకృతి తత్వమును తెలుసుకొనుచున్నాడో అతడు ఈ జడ జగత్తునందు వర్తించుచున్నను మరల మరల జన్మించువాడు కాడు – భగవద్గీత

10) ప్రకృతి జన్యములగు గుణములచేత బొత్తుగా విడువ బడిన జీవులు పృథ్వియందు మానవులలోగాని,స్వర్గమందు దేవతలలోకాని, లేరు, జ్ఞానులు, కర్ములును ప్రకృతి గుణములకు వశీభూతులై యుందురు.
– భగవద్గీత

11) మోహవశముచే నీవు యుద్ధము చేయుటకు నిశ్చయించు కొనక పోయినను స్వభావ జనితమగుస్వకర్మ ప్రేరణచే అవశ్యముగా నీవు ఆకార్యమునందు ప్రవర్తింతువు. – భగవద్గీత



10

## మాయాలేక మిధ్య

1) ఓ రామచంద్రా! చిత్రమందలి అమృతము, అమృతము కాదని తెలుసుకొనుము. అట్లే చిత్రమందలి అగ్ని, అగ్ని కాదని తెలుసుకొనుము. చిత్రమందలి స్త్రీయు నిక్కముగా స్త్రీకాదు అని తెలుసుకొనుము. అదే రీతిగా వాచా వివేకమును, అవివేకమే అని నీ వెరుగుము - **యోగవాశిష్ఠము**

2) మాటలు కడ తేర్చవు - **జిల్లెలమూడి అమ్మ**

3) అజ్ఞానముచే ఈ జగత్తంతయు మాయా మయముగ నుండును జ్ఞానముచే ఇది అంతయు బ్రహ్మ రూపమే అయిపోవును. - **యోగవాశిష్ఠము**

4) ఏ వస్తువు మిధ్యయని తెలుసుకొన బడినదో దానియందిక గ్రాహ్య బుద్ధిఎట్లు కలుగును? స్వప్నమని తెలుసుకొనిన పిదప ఇక స్వప్నమందలి బంగారమును ఎవడు గ్రహింపబోవును. - **యోగవాశిష్ఠము**

5) మృత్తికా విగ్రహమున భ్రాంతిచే కల్పింప బడిన శత్రువునందు జ్ఞానముచే శత్రుభావము, భయము నశించునట్లు జ్ఞానికి మనస్సుదృశ్య పదార్ధములు ఉన్నప్పటికినీ, బ్రహ్మ రూపమున నున్నవై, దృశ్యరూపమున శమించియే పోవుచున్నవి. - **యోగవాశిష్ఠము**

6) వాస్తవముగా ఏదియు ఒకింతయయినను మరణించుట లేదు. "జీవించు చున్నాను, మరణించుచున్నాను" అను భ్రాంతిని చేతనమే

అనుభవించుచున్నది. కాని స్వయముగా అది నశింపకయే వున్నది

**– యోగవాశిష్ఠము**

7) మాయాఅంటే ఏమిటి? మాయను అతిక్రమించేది ఎలాగ?

రమణభగవాన్ :- మనస్సేమాయ. మనస్సుఉన్నంత వరకు ద్వంద్వం వుంటుంది. ద్వంద్వం ఉన్నంత వరకు దుఃఖం ఉంటుంది. మాయనతిక్రమించాలంటే మనస్సు పోవాలి. అప్పుడు ఆత్మానందం కలుగుతుంది. **– రమణభగవాన్**

8) ఈశ్వర సాక్షాత్కారము లభింపనిదే క్షుద్రమైన లోహము, పరుశవేది యొక్క స్పర్శచే బంగారముగా మారనిదే "నేను కర్తను" అనుభ్రమ తొలగదు. ఈ భ్రమ తొలగకుండునంత వరకు "నేనీ సత్కార్యమును చేసితిని! అదుష్కార్యమును చేసితిని" అనుభేద భావము కలుగుచునే యున్నది. ఈ భేధ భావమే - ఈ భేధ దృష్టియే - మాయ దీని మూలముననే సంసార భ్రమణము నిరంతరము సాగుచున్నది. సత్వ గుణ ప్రధానమగు విద్యామాయ శరణుజొచ్చితిమేని మనలనది ధర్మమార్గమున నడిపి భగవంతుని బొందించును. భగవత్ సాక్షాత్కారము పొందిన వాడే మాయారూపమైన సంసార సాగరమును దాటుచున్నాడు. భగవంతుడే కర్తయనియు, స్వయముగా తాను అకర్తయనియు, అశక్తుడననియు, గ్రహించునతడు జీవన్ముక్తుడగు చున్నాడు, అనగా ఈ శరీరము నుండియే ముక్తుడగుచున్నాడు.

**– రామకృష్ణ పరమహంస**

9) ప్రశ్న :- **జగత్తు మిథ్యమా?**

రామకృష్ణ పరమహంస :- నీవు భగవంతుని గనజాలనంత వరకు జగత్తు మిధ్యయే సమస్తము భగవత్ స్వరూపములుగా గనుటకు బదులు "నేను, నాది" అను పాశములచే మానవుడు సంసార బద్ధుడగుచున్నాడు. అట్లు అజ్ఞాన మోహితుడై, విషయాసక్తుడై సంసార కూపమున బడిపోవుచున్నాడు. తరణోపాయము స్పష్టముగా గోచరించు చున్నను, మాయ తనజాలము

నుండి మానవులను వెలువడ నీయదు. తన యొక్క మోహముచే వారిని అంధులను జేసివైచును. విచారించిన ఈ సంసార మెంత అనిత్యమో నీకే తెలియగలదు. మనము నివసించు యింటిని గూర్చిక్షణం ఆలోచింపుము. ఇందు ఎందరు వుట్టిరో? ఎందరుగిట్టిరో? ప్రాపంచిక విషయములు ఒక్క క్షణమున మన ఎదుట కాన్పించి, ఉత్తర క్షణమున అదృశ్యమైపోవును

**– రామకృష్ణ పరమహంస**

10) ఉన్నది లేనట్లు కనపడటమే భ్రాంతి తనలో నేననేదే సర్వత్రా వున్నది. కాగా సర్వత్రాలేనట్లు కనపడటమే భ్రాంతి. మమకారమునకు పరమితిపోవటమంటే తనలో నేననేదే సర్వత్రా వ్యాపించి యున్నదని అనుకోవటమే. "నేను, నువ్వు, అది" అనుకునేది అహంకారపు బ్రహ్మ అని "నేను, నేను, నేను" అని అన్నింటినీ అనుకునేది అహః బ్రహ్మాస్మి అంటారు. జరిగే పనులలో తన యత్నానికి అనుకూలముగా జరిగిన, పురుషకారమని, తమ యత్నానికి వ్యతిరేకముగా జరిగిన విధియని అనుకోవడము మానవత్వము. కాని ప్రపంచమంతటా జరిగే పనులు దైవం వల్లనే జరుగుతున్నాయి అని అనుకోవడము తన దైవాన్ని చూడడము. ఈ స్థితిలో తాను ఇంకా పొట్టి అయితేనే వుంది - రామానుజుల దర్శనమిది. తనలో కూడా దైవాన్నే అంటే అన్ని పనులు, తన పనులు కూడా విశ్వాత్మ పనులే అని అనుకోవడము దైవమే అవడము. యిది శంకరుల స్థితి ఈశ్వరుడే "భామయస్సర్వాని భూతాని కనుక నీవు నమ్మకమిచ్చి చేయించినది చేయిస్తున్నాను స్వామి అని అన్ని పనులు చెయ్యి. **– జిల్లెలమూడి అమ్మ**

11) నేను హృదయస్థ మైవున్న కొండొక పరమాత్మ చేయించి నట్లు చేస్తున్నాను **– పంచదాశి**

12) **పరమేశ్వరుడు నిర్లిప్తుడుగా వుంటే మాయే ఇదంతా చేయిస్తున్నదంటారు. అది నిజమేనా? వాడి ప్రేరణేగా ఇదంతా, మాయ అని ఎందుకు అడ్డం ఆయన ప్రేరణ అయినప్పుడు?**

అమ్మ:- నడక అవసరమని అనుకున్నాడు. అంటున్నాడు. నడిపిస్తున్నాడు. మాయ అని నేను అనను. ఇదంతా తన సంకల్పమే. అంటే ఆ కనపడే కారణం తనైనప్పుడు ఇక రెండుగా ఎందుకు? నున్నది ఒక్కటిగా తోచడం కోసం మాయ అన్నారు. **– జిల్లెలమూడి అమ్మ**

13) మాయ శక్తి మయం. ఒకటిగా వుండి, ఒక్కటిగా కనిపించక పోవటం మాయ. వాడే అన్నీ చేయిస్తున్నాడు అనేది తెలియక పోవడమే మాయ. మాయ అంటే వేరే వుంది అనటం లేదు. మాయ కూడా భగవంతుడే.

**– జిల్లెలమూడి అమ్మ**

14) మిధ్యకు అర్థం లేదని కాదు. మార్పు అనుకుంటాను. నాలుగు ఎకరాలు సంపాదిస్తున్నాడు అంటే - తాను లేకపోయినా తన పిల్లలు తింటారనే ఉద్దేశ్యంతోనేగా. అది సంపాదిస్తూ (జగత్తు) మిధ్య అంటే ఎట్లా? తను పోయినా ముందు వుంటుందనేగా అప్పుడు జగత్తు సత్యంకాక ఎట్లా వుంటుంది?

మిధ్య అంటే లేదు అని వాళ్ళ ఉద్దేశ్యం. జగత్తు స్వప్నమంటారు. స్వప్నంమారుతున్నదిగా. ఏరకంగా చూసినా పరిణామమే. **– జిల్లెలమూడి అమ్మ**

15) మాయా స్వరూపం ఇట్టిదని ఇంత వరకు ఎరిగిన వారెవ్వరూ లేరు. మాయ అంటే నా శక్తియేకాని వేరొకటి కాదు. భగవంతుడనైన నేను నామాయా శక్తి నధిష్టించి, కాలరూపుడనై, జీవాత్ముడనై, లోకస్వరూపుడనై, స్వభావుడనై, ధర్మాత్ముడనై నానా విధాల గోచరిస్తుంటాను. కాలరూపుడనై సుఖ, దుఃఖాల పరిమితిని నిర్ణయిస్తున్నాను. జీవ రూపుడనై సుఖ, దుఃఖ భోక్తనుగా వున్నాను. స్వభావ రూపుడనై దేహత్యాదులను కలుగ చేస్తున్నాను. ధర్మరూపుడనై పూర్వరచిత పుణ్యకర్మలకు ఫలంగా స్వర్గాది నివాసం కల్పిస్తున్నాను. నా మాయను దాటడం అంత సులభ కార్యం కాదు. ఎవ్వరు నాకు ప్రపత్తి కావిస్తారో వారు మాత్రమే నా మాయనుదాటగలరు. మాయను దాటడానికి ఇదే సులభోపాయం. (గీత) పారమార్థిక దృషికి మాయ అన్నదే

లేదు. మాయ అన్నది నాకు వ్యతిరిక్తముగా వున్నదంటె పరమాత్మ ఏకము, అద్వితీయము, అఖండము, పూర్ణము కానేరదు. జ్ఞానం కూడా "జలం కతక రేణువత్" అన్నన్యాయాన్ని అనుసరిస్తుంది. కతక రేణువును (ఇండుపుగింజ) నీటిలో వేసి నపుడు కతకరేణువు నీటిలోని మురికిని నశింప చేసితాను కూడా నశిస్తున్నది. ఆ తీరుననే జ్ఞానం అజ్ఞానాన్ని రూపుమాపి తాను కూడా నశించి పోతుంది **– భాగవతం**

16) జీవునికి గుణాలను బట్టి బంధముక్తులనుగా చెపుతున్నారే కాని నిజానికి ఇతనికి బంధముకాని, ముక్తి కాని - ఈ రెండూ లేవు. గుణములు మాయా మూలకాలు. మాయ అంటే మిధ్య. మిధ్య అయిన మాయ వలన ఏర్పడిన గుణాలు కూడా మిధ్యలే కదా! అందువల్ల గుణాలు మిధ్యలైనప్పుడు తత్కార్యములని చెప్పబడే బంధముక్తులు కూడా మిధ్యలే అవుతాయి. కాబట్టి జీవుని బంధముక్తులు కేవల వ్యవహారికాలని అంటే అజ్ఞాన జనితమని తెలుసుకో, భ్రాంతి పడటం, సత్యాన్ని గ్రహించటం, అహంకారజీవుని కార్యాలు. ఈ జ్ఞాన, అజ్ఞానాలు రెండూ మాయా కార్యములైనట్టి స్థితులే. మాయకు అంటే పరమేశ్వరుని అనిర్వచనీయ శక్తి పరమేశ్వరునికి ఆధ్యంతాలులేవు. మాయక మాత్రం అంతమున్నది. బంధము ముక్తి అన్నది భావాలు మాత్రమే. అవి రెండూ రెండు మానశిక స్థితులు. ఎవడు సర్వంతానే ఆచరిస్తున్నానని, ఫలం అనుభవిస్తున్నాని అనుకుంటాడో అతనే బద్ధ జీవుడు. ఎవడట్లు తలంపక ఇంద్రియులు తమ తమ వ్యాపారాలను చేస్తున్నాయని తాను సాక్షీమాతృడై చూస్తున్నవాడినని అనుకుంటాడో అతనే ముక్త సంగుడు.

**– భగవద్గీత**

17) అంతర్యామియగు పరమాత్మ సర్వ భూతములను యంత్రముపై యధిష్టించిన బొమ్మల వలె మాయాశక్తిచేత త్రిప్పుచున్నవాడై సమస్త ప్రాణుల యొక్క హృదయ ప్రదేశమందున్నాడు. **– భగవద్గీత**

11

## దైవసంకల్పము

1) ఈ ప్రపంచమున వాస్తముగ ఎవ్వడును, ఎన్నడును, ఎవనికిని బంధువుకాడు. ఎవ్వడును, ఎవనికిని శతృవుకాదు. సర్వులకు (ఆ బంధువు, మిత్ర శత్వాది సమస్తమును) సదా సర్వేశ్వరుని ఇచ్ఛ చేతనే ఆయా ప్రకారముగా సంభవించు చున్నది. – **యోగవాశిష్ఠము**

2) ఓ అర్జునా ! ఎవ్వరు ఏ ప్రకారముగా నన్ను సేవింతురో వారిని ఆ ప్రకారముగానే నేను అనుగ్రహించెదను. మానవులు సర్వ విధముల నామార్గమునే అనుసరించుచున్నారు . – **భగవద్గీత**

3) సమస్తము ఈశ్వరేచ్ఛ చేతనే జరుగుచున్నదను దృఢవిశ్వాసము కలవాడు తాను ఈశ్వరుని చేతిలో కేవలము ఉపకరణమని భావించును. అట్టివాడు ఈ జన్మమునందే ముక్తుడు అగును. సర్వేశ్వరా ! నీవే ఈ కార్యమును చేయుచుండ వీరు (జనము) ఆహ ! నేను చేయుచున్నాను అందురు. – **రామకృష్ణ పరమహంస**

4) **ప్రశ్న : స్వామి ! మనకు స్వేచ్ఛ కలదందురు అనగా ధర్మము కాని, అధర్మముకాని, మరిఏది అయినా కాని మన ఇష్టానుసారము చేయగల మందురు నిజమా? మనకు నిజముగా స్వాతంత్రము కలదా?**

గురుదేవులు :- సర్వమూ భగవత్ సంకల్పము ననుసరించి నడచును.

ఇది యంతయు వానిలీల. అతడు మనచేత అనేక విధముల, అనేక కార్యములను మంచివి, చెడ్డవి, ఉత్తమ మైనవి, నీచమైనవి చేయించుచున్నాడు. వీనికన్నింటికి మూలమతడే. యోగ్యులు, అయోగ్యులు ఎల్లరును వానిమాయయే. వానిలీలయే. ఉదా :- తోటలోని చెట్లన్నియు ఔన్నత్యమునకాని, రామణీయకమునగాని, వైభవమునగాని, పవిత్రతనుగాని, ఒండొంటితో సమానముకావు కదా! బ్రహ్మసాక్షాత్కారము కానంత వరకు నరుడు తాను స్వతంత్రుడనను కొనుచుండును. కాని ఆ భగవంతుడే ఈ భ్రాంతిని వానియందుంచువాడు. లేని పక్షమున పాపకార్యములు అపారముగా హెచ్చిపోవును. అప్పుడిక జనులకు భీతియే వుండకుండును. కాని బ్రహ్మ సాక్షాత్కారము బడసిన వాని భావము ఎట్లుండునో తెలియునా! అతడు మనః పూర్వకముగా ఇట్లు భావించును. దేవా ! నేను యంత్రమును. నీవు యంత్ర రధికుడవు నేను గృహమును, నీవు గృహాధిపతివి. నేను రధమును, నీవు రధికుడవు. నీవు నన్నెట్లు నడిపిన నేనట్లు నడతును. ఎట్లు పలికించిన అట్లు పలుకుదును. – **రామకృష్ణ పరమహంస**

5) అర్జునా! ఎల్లభూతములకు నియామకుడైన ఈశ్వరుడు ఎల్ల ప్రాణుల హృదయములందున్నవాడై యంత్రగాడు బొమ్మలనాడించు రీతిగా మాయచేత ప్రాణులను భ్రమింప చేయుచున్నాడు. – **భగవద్గీత**

6) దేవుడే దొంగను పోయి దొంగతనము చేయమని ప్రేరేపించు చున్నాడు. మరియు దొంగనుగూర్చి జాగ్రత్త పడుమని గృహస్థుని అయనే హెచ్చరించు చున్నాడు. సర్వమునకూ అతడే కర్త – **రామకృష్ణ పరమహంస**

7) దైవానుగ్రహమునకును, జీవుని స్వతంత్రమునకును, సమన్వయము కుదరక గురుశిష్యులకు -

గురుదేవులు :- స్వాతంత్ర్యము ! స్వాతంత్ర్యము. సర్వము ఈశ్వర సంకల్పముపై ఆధారపడియున్నది. మన స్వతంత్రము, (లేదా మనయిచ్ఛ) ఈశ్వర సంకల్పముతో అవు గుంజకు కట్టబడినటుల బంధింపబడియున్నది.

అయినను ఒక నిర్ణీత వలయంలో ఆవునకు కొంత స్వాతంత్ర్యము వున్నట్లు మనకును కొంత స్వాతంత్ర్యము వున్నమాట నిజమే కాబట్టి మానవుడు స్వతంత్రుడననుకొనును. కాని వాని స్వతంత్ర్యమును, ఇచ్ఛయు, ఈశ్వరేచ్ఛకు లోబడి యుండునవే అని గ్రహింపుము. **– రామకృష్ణ పరమహంస**

8) భగవంతుడు తానే సూత్రధారుడై (డైరెక్టర్) ప్రేక్షకులతో కూర్చొని, తాను ఎవ్వరికినీ తెలియని వానివలే దాగి యుండును. ఏ పాత్రను ఏ విధముగా నటింప వలయునని నిర్దేశించెనో ఆ విధముగా ఆ నటుడు చేయక తప్పదు కదా! ఈ నాటకము నందలి చిత్ర విచిత్రములు ప్రేక్షకుల హృదయాలకు మాత్రము మార్పు కలిగించునే కాని సూత్ర ధారునకు అట్టి భేదము లేమాత్రమును కలుగవు కదా! ఎప్పుడు, ఎవ్వరిచేత, ఏమిచేయించ, చెప్పించ, తలంచునో అప్పుడు వారికట్టి బుద్ధిపుట్టించును. దానికి జన్మాంతర కర్మకూడనూ కొంతచేరక తప్పదు కదా! **– భగవాన్ సత్యసాయి**

9) అతని ఆజ్ఞలేక ఏ ఒక్కటి జరుగదు. లేక అతని ఆజ్ఞను ఉల్లంఘించి పోవలెనన్ననూ అది సాధ్యముకాదు. తాను నేర్చిన నటనను, నియమించిన కాలమునను ఈ ప్రకృతిరంగమున అతడు చెప్పినట్లాడక తప్పదు. చేయక తప్పదు. జరుగక తప్పదు కదా! అన్నింటికి అతని సంకల్పము మూల కారణములై కార్యమును జరిపించును. ఈ పాంచభౌతిక పిండము ఆప్రభువు ప్రేరణలేక ఏమియు జరుగదు. **– భగవాన్ సత్యసాయి**

10) మానవజాతి ఏకరూపమైనను, గుణాధి భేదములమీద ఆధారపడి యుండును. మరి కొంత లోతుగా విచారించినా, ఉచ్ఛ, నీచ భావములు సహజములనక తప్పదు. మల మూత్రములలో భేద మేమాత్రము లేకున్ననూ, గోవుకు సంబంధించిన మల మూత్రములు మాత్రము పవిత్రములనియు భావింతురు. మానవులు రూపమునందు అందరూ ఒక్కటే అయినను దేహాధి ఉపాధులను అనుసరించి గుణ ప్రవర్తనల ననుసరించి శ్రేష్టుడు, అశ్రేష్టుడు అందురు. అటులనే విద్యత్ ప్రవాహము ఒక్కటే అయినను బల్బుల

తారతమ్యములననుసరించి, వాటి ప్రకాశములందు ఉచ్ఛ, నీచ బేధములు మనము చూచుచున్నాము. పై విషయములను గుర్తించిన ప్రపంచ వ్యవహారమునడచుటకు భేదములు, ఉచ్ఛ, నీచ స్థాయిలు, వర్ణ జాతి, మతములు మొదలగు తారతమ్యములు నుండును. లేకున్న కాలచక్రము సక్రమముగా పనిచేయజాలదు. ఇది భగవంతుని నిర్ణయము

**– భగవాన్ సత్యసాయి**

11) ఈశ్వరుడే పురుషకారముగానగును సర్వక్రియలు ఈశ్వర సంబంధములైనప్పుడు మానవ ప్రయత్నమునకు తావేది? ఈశ్వర సంకల్పమే వ్యక్తిగత సంకల్పమూ, ప్రయత్నమూ, నగును. **– పంచదాశి**

**12) భూకంపమెట్లా కలుగుతుంది?**

అమ్మ:- "దానివల్లే" (దైవము) కంపానికి వ్యుత్పత్యర్థంలేదు. స్పందనానికి లేదు. పువ్వు విచ్చిన తరువాత తెలుస్తుందిగాని, ఎట్లా విచ్చుతుందో తెలీదు. జరిగేటప్పుడు తెలియదుగాని, జరిగిన తరువాత తెలుస్తుంది. స్పందనం కనపబడదు. **– జిల్లెలమూడి అమ్మ**

13) ఈ ప్రపంచమును నడిపించు సూత్రధారి భగవంతుడు. సకల జంతుకోటి పాములు, తేళ్ళతో సహా భగవదాజ్ఞను శిరసా వహించును. వారి యాజ్ఞయైనగాని ఎవరును ఇతరులకు హాని చేయలేరు. ప్రపంచమంతయు వానిపై నాధారపడియున్నది. ఎవ్వరునూ స్వతంత్రులుకారు. కాబట్టి మనముకనికరించి అన్ని జీవులను ప్రేమించ వలెను. శిష్యులకు దృఢమైన నమ్మకముండవలయును. తోడుగా బుద్ధి కుశలత, ఓరిమియున్నచో అట్టివారికి ఆధ్యాత్మిక పరమావధి దూరముగాదు. అట్టివారు త్సురోపదేశముల కర్హులగుదురు. అప్పుడు గురువు తటస్థించి జీవిత పరమావధిని పొందుటకై ఆధ్యాత్మిక మార్గమున నడిపింతురు **– శిరిడి సాయిబాబా**

14) పరమాత్మ తన ప్రకృతి నధిష్టించి, విశ్వరూపాన్ని ధరిస్తాడు. పరమాత్మ యొక్క ప్రకృతి పరా ప్రకృతి, అపరా ప్రకృతి అని రెండు విధాలు.

జీవ భూత సృష్టి సమస్తం పరా ప్రకృతి, జడ సృష్టి సమస్తం అపరా ప్రకృతి అనబడుతున్నాయి. పరా ప్రకృతిని అక్షరమని, అపరా ప్రకృతిని, క్షరమని కూడా అంటారు. పరా ప్రకృతి వలన సమస్త జగము ధరింపబడుచున్నది. పరమాత్మ తన రెండు ప్రకృతుల నధిష్టించినా వాటికంటే ఉత్తముడై పురుషోత్తమాఖ్యతో అలరారు తుంటాడు. జగాద్ధారణ కారణాన పరమాత్మను ఈశ్వరుడంటారు. – **భగవద్గీత**

పరమాత్మ సృష్టిని సంకల్పించి అందులోనికి ప్రవేశించాడు. ఏ రూపంలో? ప్రాణ రూపంలో. ఆ ప్రాణాన్నే జీవుడంటారు. ఆ ప్రాణం సూక్ష్మాతి సూక్ష్మమైన నాదరూపంలో వుంటుంది (ఓంకారధ్వనిలో) – **భాగవతం**



## 12

## ఆత్మ

1) ఓ రామచంద్రా! ఈ జగత్తంతయు ఆత్మయే. ఇట అనేకత్వము లేదు. ఈ ప్రకారముగా జగత్తును ఏక (ఆత్మ) రూపముగనే ఎరిగి ధీరుడు భేదము నొందడు. **– యోగవాశిష్ఠము**

2) ఈ జగత్తు సత్యమై, సర్వ విధముల పరిపూర్ణమైనట్టి బ్రహ్మయేయని నేను ఎరుగుచున్నాను. (బ్రహ్మరూపుడగుటచే) నాకు దుఃఖము లేదు. కర్మలు లేవు. మోహము లేదు. వాంఛిత పదార్థమున్నూ లేదు.

3) దేనియందు సమస్త ప్రపంచము కలదో, దేనినుండి సమస్తము ఆవిర్భవించుచున్నదో ఏది సమస్తము అయివున్నదో, ఏది సర్వత్రా వ్యాపించి యున్నదో, ఏది సర్వమయమై యొప్పుచున్నదో అట్టి ఆత్మను నేను ఉపాసించుచున్నాను.

4) అంతరంగమున ఈ ఆత్మ దేవుని ధ్యానించుటయే అతనిపూజ. ఇది తప్ప అతనికి మరియొక పూజలేదు. కాబట్టి ముల్లోకములకు ఆధారభూతుడగు ఆ పరమాత్మను ధ్యానము ద్వారా నిత్యము పూజింపవలయును.

5) ఆ ఆత్మ దేవుడు కుండయందును, వస్త్రమందును, మఱిచెట్టునందును, గోడయందును, బండి యందును, కోతి యందును,

వెయ్యేల సర్వత్రాకూడ స్థితి కలిగియున్నాడు. మరియు బ్రహ్మ, విష్ణు, శివ, హర, ఇంద్ర కుబేర మాయాదులతడే.

6) అంతఃకరణమున నున్నట్టి శుద్ధ (ఆత్మ) యొక్క జ్ఞానము, నిరంతరము కలిగ యుండుటయే గొప్ప ధ్యానమనియు, పూజ అనియు చెప్ప బడినది.

7) చూచుచున్నను, వినుచున్నను, తాకుచున్నను, వాసన చూచుచున్నను, తినుచున్నను, నిదురించు చున్నను, శ్వాసగైకొను చున్నను, మాట్లాడు చున్నను, చదువు చున్నను, వదులు చున్నను, గ్రహించు చున్నను, మనుజుడు ఆత్మమయుడై యుండవలెను.

8) ఆత్మయే బుధ్యాదులద్వారా తత్వ విచారణ గావించి అవిద్యను బాధిత మొనర్చి స్వయముగా ప్రకట మగుచున్నది. కాబట్టి విచారణచే ఆత్మ స్వయముగా తన్నుతానుగాంచు చున్నదగును. ఇట వాస్తవముగా ఆత్మయే కలదు. అవిద్య అనునది లేదు. అని ఎరుగటయే అవిద్యాక్షయమని చెప్పబడినది

**– యోగవాశిష్ఠము**

9) బాహ్యావృత్తిచే జనించిన అజ్ఞానము తిరిగి ఆత్మ జ్ఞాన రూపమగు వృత్తిచే (చరమ సాక్షాత్కార వృత్తిచే) విచారింప బడినదై శమించి పోవుచున్నది. వాయువుచే జనించిన దీపము తిరిగి ఆ వాయువు చేతనే నశించినట్లు ఏది, దేనిచే జనించునో అది దానిచేతనే నశించి పోవును. **– యోగవాశిష్ఠము**

10) స్వానుభవము చేతనే ఎరుగబడునట్టి సారరూపమగు ఆత్మ వస్తువు ఏదికలదో అది మరియెకనికి చూపుటకు సాధ్యపడదు. ఏలయనగా అది దానినెరిగినవాని కంటికి కూడా కనిపించదు. స్వప్రకాశ రూపముచే కేవలము అనుభూతమగును.

11) ఓ రామచంద్రా ! దేనినుండి ద్రష్ట, దర్శన, దృష్టములను మూడునూ (త్రిపుటి) ఉదయించునో మరల దేనియందామూడునూ అస్తమించి పోవునో అదియే నిర్వికారమగు మలరహితమగు చిదాకాశమని ఎరుగుము.

**– యోగవాశిష్ఠము**

12) ఈ ప్రపంచాన్నంతా ఆత్మగా (తానుగా) లేదా భగవంతునిగ చూడటమే నిజమైన విశ్వరూప సందర్శనం. **– రమణ భగవాన్**

**13) ప్రశ్న:– బ్రహ్మానందమంటే ఏమిటి?**

అమ్మ:- ఈ ద్వంద్వాలు ఆ బ్రహ్మమని గుర్తించటమే బ్రహ్మానందము.

**– జిల్లెలమూడి అమ్మ**

14) పరమాత్మ స్థితి - అంటే తాను కాకుండా లేదనే స్థితి. అంతా తానైనవాడు. గుర్తించేగుర్తు తానేగా. అంతా శక్తిమంతంగా వుండి అర్థంకానిది ఆత్మ. ఆత్మ, అనాత్మ అని రెండు అంటారు. అసలు రెండులేవు. "అనాత్మ అనుకొని ఆత్మని - ఒకటి అనగా పది అనుకోనున్నట్లు - ఇంకోటిగా అనుకోమంటారు". ఆత్మకు రూపంలేదు. ఇంకోటేదో చూడమంటారు చూడగలిగిననాడు శరీరమే ఆత్మ అనిపిస్తుంది. ఆత్మ అని తెలియటము అంటూ వస్తే శక్తి రూపంగానే తెలుస్తుంది. "నేను అంటే" ఏదిచూస్తూ, ఏది గుర్తు పడుతున్నదో, ఏది నేను అని అడిగించిందో, ఏది చేయిస్తున్నదో అదే నేను. సూది మోపను సందు లేదంటూ - సాక్షాత్కారము అయిందంటే ఏమిటి? **– జిల్లెలమూడి అమ్మ**

15) ప్రాణాదులన్ని (ప్రాణము, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి) జడ పదార్థాలు. వాటికి స్వతంత్ర్య శక్తి కలుగదు. అందువల్ల అవి ఏదన్న చేయాలన్న స్వతంత్రించి చేయలేవు. కనుక వాటిని నమ్ముకుంటే ప్రయోజనం వుండదు. అన్నిటికీ కర్త పరమేశ్వరుడు. అతనియందు ఎల్ల వేళలా భక్తి నిలిపి అన్యముల యడ గాఢ విరక్తిని జనింప చేసి చిత్తాన్ని ఏకాగ్ర మొనర్చినప్పుడు జ్ఞానం ఉదయిస్తుంది. ఆ జ్ఞాన పూర్వకంగా ఆత్మ అనగా జీవుడే. కాని వేరు కాదు. కేవలుడుగా యున్నప్పుడు ఆత్మయని ఉపాధిని ప్రవేశించినప్పుడు జీవుడని, ఏకపదార్థానికే అవస్థా భేదాన్ని బట్టి వేరువేరు పేర్లు కలుగుతున్నాయి. మౌనం అనగానే మాట్లాడక పోవటం మాత్రమే కాదు. మనోవాక్కాయ శక్తులను కేంద్రీకరించి పరమార్థతత్వ పరిశోధనకు కాలాన్ని వినియోగించటం మౌనం యొక్క పరమోద్దేశం. **– కపిల మహర్షి**

13

## జగత్తు

1) రామా! రాఘవా! నీకంటే మరియొకటి యున్నదని నేనెరుగను. నాకెట్లు తెలిసెనో ఈ విధమును చెప్పెదను వినుము. ఈ కనపడుచున్న జగత్తు పదునాలుగు ఇంద్రియములకు గోచరించుచున్నది. ఆ ఇంద్రియముల వలననే ఇది (ఈ జగత్తు) పుట్టినది కాని నిజము కాదు. ఈ జగత్తో నీ రూపమే. కాన నీవే యగుదువు. కాబట్టి ఈ జగత్తు కనపడుట యనగా జగద్వ్యాపుడవైన నీవు సాక్షాత్కరించుటయే యైనది. ఇట్లు జగమంతయు నీవే యని ఎరిగినందు వలన నీకంటె వేరొకటి లేదని నేను తెలిసికొంటిని. ఇట్టి ఎరుక వలన ఇంత వరకు జగత్తిది నీకంటే వైరైనదిని తలంచు చుండిననా అజ్ఞాన మంతయూ నశించినది. నీకృపాకటాక్షము చేత బ్రహ్మానంద స్వరూపుడనైతిని. ఐనను జగత్తునందు కనపడుచున్న ఈ సమస్త రూపములు బ్రహ్మ మొక్కటియే అను జ్ఞానము కలిగి అన్నింటినీ బ్రహ్మముగానే తలంచు చుండునటుల నా అంతరంగమందు ఎల్లప్పుడూ కలిగియుండునట్లుగా నీవు అనుగ్రహింపుము.

– సీతారామంజనేయ సంవాదము

2) (అధీష్టాన దృష్టిచే) ఈ జగత్తంతయు నేనే, ఈ సమస్తము నాదే అనిగాని లేక (ఆరోపదృష్టిచే) అహంకారము నేనుకాను. ఇతర దృశ్య పదార్థమేమియును నేను కాను అనిగాని యదార్థతత్వమును బాగుగా

7) ఓ రామ చంద్రా! ఈ జగత్తంతయును ఆత్మయే. ఇట దేహాదుల కల్పన ఎచట? నీవేది చూచుచున్నావో అదియంతంయు సచ్చిదానంద రూపమగు బ్రహ్మమే (ఆత్మయే)అయియున్నది. - **యోగవాశిష్టము**

8) నిరాకారమైనట్టి శివుని యొక్క ఇచ్ఛయే ఈ జగత్తును నిర్మించున్నది. మరియు సర్వజీవుల యొక్క జీవన హేతువగుటచే ఆ ఇచ్ఛా రూపిణి జీవ చైతన్యమనియు వచింపబడినది. స్వయముగా, జగద్రూపముగా పరిణామము నోందుటచే ఆమె ప్రకృతి మాతృత్వము బొందుచున్నది. - **యోగవాశిష్టము**



## 14

## ధ్యానము

1) ధ్యానమే ఆత్మదేవునికి (పూజ) కానుక. ధ్యానమే ఆ దేవునకు ఇష్టము. శుద్ధ చిన్మయాత్మమగు ధ్యానమే అతని యొక్క అర్ఘ్యపాద్యములు. ధ్యానాభి వ్యక్తమగు చైతన్యమే పుష్పము. ఈ ప్రకారముగా పూజ యంతయును ధ్యానమనియే చెప్పబడినది. – **యోగవాశిష్ఠము**

2) ప్రశ్న : **నామ జపము వలన ప్రారబ్ధము నశించునా?**

శారదాదేవి : ప్రారబ్ధ కర్మము ననుభవింపక తప్పదు. అయినను దాని తీవ్రతనామ జపము వల్ల క్షీణించును. కాలు పోగొట్టు కోవలసిన విధియుండగా పాదమున ముల్లు గుచ్చుకొనుట వంటిది. దీక్షలో ప్రతి దినము వేల కొలది పర్యాయములు మంత్ర జపము ఒనర్చుటచే, మనస్సు అనాయాసముగా నిలుకడ చెంది ధ్యాన నిమగ్నమగుననియు, కుండలినీ ప్రబోధము కలుగును. జపమొనర్చుచూరాగా, భగవత్ దర్శనములభించిన తరువాత జపము ఆగిపోవును. మనస్సు దేనిమీదనో ఉంచి లక్షపర్యాయములు జపించుట కంటే ఏకాగ్రచిత్తముతో కొలదిసారులైన జపించుట మేలు. తన్ మూలమున భగవదనుగ్రహము కలుగను. – **శారదాదేవి**

3) ఆత్మ సాక్షాత్కారమునకు ధ్యానమవసరము. దానినలవరచుకొన్నచో వృత్తులన్నియును శాంతించును. కోరికలన్నియు విడచి, నిష్కామివై, నీవు

సమస్త జీవరాశియందు గల భగవంతుని ధ్యానింపుము. మనస్సు ఏకాగ్రమైనచో లక్ష్యము నెరవేరును. సదా నానిరాకార స్వభావమును ధ్యానించుటయే జ్ఞాన స్వరూపము, చైతన్యము, ఆనందము. మీరిది చేయలేనిచో మీరు రాత్రింబవళ్ళు చూచుచున్న నా ఆకారమును ధ్యానించుడు. మీరిట్లు కొన్నాళ్ళు చేయగా మీ వృత్తులు కేంద్రీకృతమగును. ధ్యాతా, ధ్యానము, ధ్యేయము, అను మూడింటికీ గల భేదముపోయి, ద్యానించువాడు చైతన్యముతో ఐక్యమై బ్రహ్మముతో అభిన్నమగును. **– షిరిడీసాయి బాబా**

4) కొందరు ధ్యాన యోగముచే హృదయమందు నిలచియున్న పరమాత్మను స్వయముగనే దర్శించు చున్నారు. మరి కొందరు ఆత్మానాత్మ వివేకము చేతను, ఇంకను మరికొందరు నిష్కామ కర్మయోగము చేతను పరమాత్మను దర్శించు చున్నారు. **– భగవద్గీత**



15

## జ్ఞానము

1) ప్రశాంత నిర్మల చిత్తుడగు జ్ఞానికి రాగ, ద్వేష, భయ, ఉన్మాద, మాన, మోహాతిశయములతో కూడిన ఈ సంసార వ్యవహారములు నటుని చేష్టలవలే కల్పితములుగా కానుపించును. (ఇదియంతయు జ్ఞానికి ఒక నాటకము వలె కల్పితముగా కన్పట్టును అజ్ఞానికి సత్యమైనదిగా తోచును అని భావము) **– యోగవాశిష్ఠము**

2) చైతన్య స్వరూపమగు ఆత్మతత్వమున్నప్పుడే సర్వాస్పదము సమస్త కార్యకరణాది విక్రయ జాలమంతయు కలుగుచుండును. అసలు ఈశా అను శబ్ధమునకు అర్ధము ఇదే. ఇట్టి ఆత్మ తత్వము దగ్గర, దూరము అనునది లేక రెండింటియందు గోచరించును. చలనముగానూ యుండును, అచలముగానూ యుండును. ఇది జగత్తునకు లోపల, వెలుపల కూడా యున్నది. నిజ తత్వమును తెలుసుకొను వారే జ్ఞానులు. అజ్ఞానులకు ఇది సాధ్యముగాదు. ఎటులన స్మృతి కలవారికి ఏ వస్తువైనను చెంతనే కనిపించును. విస్మృతి కలవారు వంటిపై నగలున్నను అవిలేనట్లే తలచి దూరమున వెతుక ప్రయత్నింతురు. అటులనే అజ్ఞానికి అన్ని సత్యములు అందుబాటులో నున్నను విస్మృతి వలన అట్టి సత్య ఆత్మ అతీతమైన స్థానమందు వున్నదని తలంచుచున్నారు. జ్ఞాని అటులకాక స్మృతి కలిగియుండుటచే

సర్వభూతములందును ఆత్మను, తన ఆత్మయందు సర్వభూతములను చూడగలుగుచున్నాడు. - **ఈశావాశ్యోపనిషత్తు**

3) తపస్సుచేకాని వైదికమగు అగ్నిహోత్రాది కర్మలచేకాని ఆత్మ లభ్యముకాదు రాగాది దోషములు తొలగి బుద్ధి నిర్మలము, ప్రసన్నము ఐనప్పుడే ఆత్మ జ్ఞానము లభించును. జ్ఞానము చేతనే సాక్షాత్కారము ప్రాప్తించును. ధ్యానముచే చిత్తైకాగ్రత, అందుచే జ్ఞానము, క్షీరము నందు వెన్న, కట్టెలయందు అగ్నివలె ఇంద్రియములతోకూడి ఆత్మ యున్నది. ఈ చిత్తము క్లేశాది కలుషితమై యున్నది. అది విశుద్ధమైనప్పుడు హృదయమున పరమాత్మ ప్రకాశించును. ఇట్టి ఆత్మ జ్ఞానము తెలుసుకున్నవాడే పూజ్యుడు. బ్రహ్మజ్ఞాని, బ్రహ్మమే. అవిద్యానాశనమే మోక్షము. - **ముండకోపనిషత్తు**

4) ఆత్మజ్ఞానం ఆవశ్యకము మోక్షప్రాప్తికి - **బృహద్ధారణ్యకోపనిషత్తు**

5) ఉపాధి ద్వారమున అభివ్యక్తమగుచున్న ఈ చైతన్యమే బ్రహ్మమని చెప్పబడుచున్నది. ఈ చైతన్యము స్వయముగా నసంగమైనను దేహాద్యుపాధి సంబంధమైనట్లు కాన్పించుచున్నది. స్వయముగా బ్రహ్మము బుద్ధిచేత ప్రయత్నించి తెలుసుకొను వారికి తెలియరాదు. బుద్ధిచే తెలుసుకొన ప్రయత్నింపని వారికి అది తెలియనగును. అది బుద్ధికి అతీతమైన స్వరూపము. అనుభవమునకే అది సాధ్యము. బ్రహ్మజ్ఞానమునకు జిజ్ఞాస నివృత్తియే పర్యవసానము. సాక్షాత్కారమే దాని ఫలము. ఈ సర్వోత్కృష్ట స్థానము సమాధి లభ్యము. సుప్రసిద్ధమైన పరబ్రహ్మము మెరుపు తీగవలే ప్రకాశించును. కనురెప్పపాటువలె అత్యంత శీఘ్రముగా ప్రకాశ తిరోధానములు కలది. ఇది బ్రహ్మము యొక్క దైవిక స్వరూపము. మనస్సు బ్రహ్మమునకు ఉపాధియగుటంచేసి అది అత్యంత సమీపమునయున్నట్లు కాన్పించును. నిజముగా అదే దానిని పొందుటలేదు. - **కేనోపనిషత్తు**

6) ఉపాసనకు చిత్తశుద్ధియు, బ్రహ్మ, జ్ఞానమునకు చిత్తైకాగ్రత నియమితములగు పూర్వాంగములు. కర్మచే చిత్తశుద్ధియు, ఉపాసనచే

చిత్తైకాగ్రత లభించును ఇట్లు కర్మోపాసనలు బ్రహ్మ జ్ఞానమునకు కారణములు కనుకనే ముందు కర్మలు, తరువాత ఉపాసనలు, పిమ్మట జ్ఞానము ఒకదాని తరువాత ఒకటి శాస్త్రములందు వివరింప బడినది. మట్టియు, సువర్ణమును తెలిసికొననప్పుడు వానిచే తయారైన, ఘట, కటక, కుండలాదులు తెలియబడుచున్నవి. మట్టియు, సువర్ణములు యదార్థములు. వాని వలన ఉత్పన్నములైన వస్తు జాలమంతయు వికారములును, అశ్వరములును, నామరూపములును, ఘట కుండలాదులు వలె జగత్తుకూడా కార్యమగుట వలన దానికొక కారణముండవలెను. ఆ కారణము "సత్" అని చెప్పబడును. సత్ అనగా నుండుట అని అర్థము. సద్ వస్తువు సజాతీయభేదములేని ఏకవస్తువు. సత్పదార్థము శుద్ధ, సత్వ, ప్రధానమగు మాయ యందు ప్రతిఫలించి, ఈశ్వర స్వరూపమున సృష్టి క్రియ నొనర్చితానే జగద్రూపమున అభివ్యక్త మయ్యెదనని సంకల్పించి తేజో, జల వాయు, రూపములో కాన్పించెను.

**– చాందోగ్యోపనిషత్తు**

7) జ్ఞానియగు జీవుడు అవసానదశయందు (సమయమున) సుషుమ్నాద్వారమున సూర్యకిరణముల ద్వారా సూర్యలోకముజేరి అచట నుండి బ్రమ్మలోకము జేరును. అజ్ఞాని ప్రాణములు చక్షురాదితర మార్గమున కర్మాను రూపములగు అనిత్యములగు ఇతర లోకములను చేరును

**– చాందోగ్యోపనిషత్తు**

8) సంకల్పములేని స్థితివున్నదనేది - అన్ని సంకల్పాలు అదే అనే స్థితి ఒకటే. అంతా ఆ సత్తాదే అనే స్థితి ఒకటే. అన్ని సంకల్పాలు ఆ సత్తావే అని గుర్తించడం. వీడి ఆలోచన లేని స్థితి, అంతా అసత్తుడే. వీడి ఆలోచన ఏమిలేదు.

ప్రశ్న :– **వీడికొచ్చిన ప్రతీ ఆలోచనా ఆసత్తాయే తీసుకొస్తుందని గుర్తించడం అనా?**

అమ్మ :- అన్ని వేళ్ళల్లో వుండాలి అంటే కాసేపు ముక్కు మూసుకోమన్నది సత్తాయే. కాసేపు బయటకి పదమన్నది కూడా ఆ సత్తాలోదే.

**ప్రశ్న :- సత్తాయేగాని తన ఆలోచన ఏమీలేదా?**

అమ్మ :- సంకల్ప రాహిత్యమంటే ప్రతి సంకల్పము నాదికాదు. ఈ సంకల్పం వాడిది అనుకోవడము. **– జిల్లెలమూడి అమ్మ**

9) పదార్థము, పరమార్థము రెండూ ఒకటేనని తెలుసుకోవడవమే జ్ఞానము. **– జిల్లెలమూడి అమ్మ**

10) బ్రహ్మము జ్ఞేయ వస్తువుకాడు. కనుక అతనిని గూర్చి జ్ఞాతృ, జ్ఞేయ, భేదము లేదు. ఇదియే ఆత్మ జ్ఞానము యొక్క పరాకాష్ట. ఉపదేశకుడే బ్రహ్మము. స్తోత్రమే బ్రహ్మమని తెలియుచున్నది ఈ విధమగు జ్ఞానము సర్వ సంసార నివారకమగుటచే జన్మరాహిత్యము నిశ్చయము వేదాంతములన్నియు పరమాత్మను చేరుటకే ఏ ధ్వని, ఏ కంఠమున ఉద్ఘోషించు చున్నను ఆ పరమార్థ వస్తువు "ఓం" అను శబ్దముచే చెప్పబడునదే. ఓంకారము పరా, అపరా బ్రహ్మము రెండింటికినీ ప్రతీకమగుటచే అవిరెండూ ఓంకార ఉపాసనచే లభ్యమగుచున్నది. హిరణ్యగర్భ ప్రాప్తికి కూడనూ "ఓం" కారమే సాధనము.

**– కఠోపనిషత్తు**



# 16
# భక్తి

1) భక్తికి పరాకాష్ట :-

నమ్మాళ్ళవారు :- నేను మాయలోపడి నాది, నేను అని నా ఆత్మను తెలియక తిరిగేను. ఆత్మను తెలుసుకోగానే నీవేనేనని నాది నీవెనని తెలిసినది అన్నారు.

రమణభగవాన్ :- అరుణాచలా ! నన్ను ఒక్కసారిగా మ్రింగి వేయక కొంచం కొంచముగా తింటున్నావేమిటి? ఈక్షణాన్నే నా అహాన్ని మ్రింగివేయుము. అని భక్తుడిగా వేడుకొన్నాడు.

2) అహంకారము తొలగి పరతత్వమున లయించినప్పుడు "ముక్తి" లభించును. నిజమైన భక్తుడు ఇట్లు భావించును "దేవా! నీవే కర్తవు. సకలమునీవే చేయుచున్నావు. నేను నీ చేతిలోని ఉపకరణమును మాత్రమే. నీవు నన్నేమి చేయించినా అది చేయుదును. ఈ సంసారము నీ విభూతియే. ఈ ఇండ్లు ఈ సంసారము అన్నియు నీవే నావికావు. నీ ఆజ్ఞానుసారము సేవ చేయుటకు మాత్రమే నేను ఇచ్చటకు పంపబడినాను. - **రామకృష్ణ పరమహంస**

3) ఈ కలియుగమున భగవత్ భక్తిరహితమైన కర్మము, నిలువజాలదు. ఈ యది ఇసుకపై మేడకట్టచూచుట వంటిది. మొదట భక్తిని అలవరచుకొనుము. అటుపిమ్మట నీకిష్టమైన యడల ఇతరమైన వన్నియు

అనగా పాఠశాలలు, ఆసుపత్రులు, మొదలగునవన్నియు నీవు ప్రారంభించ వచ్చును. మొదట భక్తి తరువాత కర్మము. భగవత్ భక్తిలేని కర్మము పునాదిలేని గోడ. అది నిలువజాలదు. - రామకృష్ణ పరమహంస

4) ప్రశ్న :- ఎప్పుడూ పాపము, నరకము ఈ మాటవల్ల ఏమి ప్రయోజనము? తప్పుపని చేసితిని, ఇక మీదట చేయనని ఒక్కసారి పలికి భగవన్నాముపై విశ్వాసముంచినచాలును.

నేను తల్లికడ కేవలము భక్తినే కోరుకొంటిని. పువ్వులను తల్లిపాద పద్మములపై నుంచి ఇట్లు ప్రార్థింతును. అమ్మా ! ఇదిగో పాపమును తీసుకొమ్ము. పుణ్యమును తీసుకొమ్ము. నాకు శుద్ధ భక్తినిమ్ము. ఇదిగో జ్ఞానమును తీసుకొమ్ము. అజ్ఞానమును తీసుకొమ్ము. ఇదిగో ధర్మాధర్మములు. నాకు శుద్ధ భక్తినిమ్ము. తర్కించుచు మిట్ట వేధాంతిగ మారుటెందులకు? "నేను, నీవు" అనెడి భేద బుద్ధి (దేహాత్మ బుద్ధి) యున్నంత వరకు నీ పాద పద్మముల యందు నాకు అచంచల భక్తి కలుగునట్లు అనుగ్రహింపుమని వేడుకొనుము. ఒక్కొక్కసారి నీవే నేను, నేనే నీవు - నీకూ, నాకూ భేదము లేదు. అని తలంతును. ఒక్కొక్కసారి ఈ "నేను" అనునది కూడా లీనమైపోవును. శక్తిని ఆశ్రయించియే సగుణ బ్రహ్మ అవతార మెత్తును. ప్రకృతినాశ్రయించి, పరమేశ్వరుడు సృష్టిచేయును. రామా, కృష్ణాది అవతారములెల్ల ఆచిదానంద సాగరమునకు చెందిన తరంగములే సుమా ! - రామకృష్ణ పరమహంస

5) భక్తి బాల్యం వంటిది. అది పామైనా తెలియదు. ఆడుకుందామనే ధ్యాసలో వుంటాడు. కత్తైనా తెలియదు. దేన్ని కావాలను కుంటాడో అది కావాలి. దేన్ని నమ్ముతాడో అది కావాలను కుంటాడు భక్తుడు.

గాఢత్వమే భక్తి మూఢత్వము నిగ్రహము కొరకే విగ్రహారాధన. తానెప్పుడు (వాడిపనేనని) తన శక్తిని ఉపయోగించటమే ఆరాధన. ధారణయే ఆరాధన. ధ్యాస కూడా క్రియే. లడ్డు అవడంలో కన్న తినడంలో రుచి వుంది. ఏకాగ్రత అంటే ప్రతి ఆలోచనా, కనపడేవన్నీ ఒకటిగా చూడటము. ఏది చూచినా,

ఎందులోనైనా ఒకే వస్తువును చూడటమే ఏకాగ్రత - జిల్లెలూడి అమ్మ

6) గాయం కూడా వాడిచ్చిందే అనుకునేవాడు భక్తుడు. గాయంగా వున్నాడను కొనేవాడు జ్ఞాని . భక్తిలో జ్ఞానం - జ్ఞానంలో భక్తి వున్నవి ఆ రెండూ వేరుకావు. - జిల్లెలమూడి అమ్మ

7) శూన్యం అనుకున్న దానికి ఆకృతి వుంది. గుర్తు పట్టినప్పుడు ఆకృతి వుంది. ఏమీ లేని స్థితి లేదు భావం వుంది. శూన్యానికి అక్కడ రూపంలేదంటావా? శూన్యమనే భావమైనా వున్నది-గుర్తు- భావము ఒకటే. భావరహితంగా ఎప్పుడు లేదు. గుర్తు కూడా భావమే. జీవుడికీ దేవుడికీ భావమే తేడా. అద్వైతానికి, విశిష్టా ద్వైతానికి తేడా కనిపించదు. శంకరుడు భక్తుడు కాడని నేను అనుకోవడం లేదు. అద్వైతంలో భక్తి లేదని నేను అనుకోను. భక్తుడుగా వున్న స్థితికి - జ్ఞానిగా వున్న స్థితికి తేడా లేదు. గీతలో చెప్పిన పండితుడికి ఏదీ తుచ్ఛమని తోచదు కదా! - జిల్లెలమూడి అమ్మ

8) నేనే ఒక రూపాయి ఎవరివద్ద నుండి యైన దక్షిణ తీసుకొనినచో దానికి పదిరెట్లు ఇవ్వవలెను. దానము చేయువాడిచ్చినది ప్రస్తుతము విత్తనములు నాటుట వంటిది. అది మునుముందు గొప్పపంట అనుభవించుట కొరకే. ధర్మము చేయుటకు ధనం ఉపయోగించ వలెను. దానిని సొంతమునకు వాడుకొనిన వ్యర్థమై పోవును. గత జన్మలో నీవిచ్చియుంటేనే కాని. నీవిప్పుడు అనుభవించ లేవు. దక్షిణ ఇచ్చినచో వైరాగ్యము పెరుగును. దాని వలన భక్తి జ్ఞానములు కలుగును.

- షిరిడి సాయి బాబా

9) శరీరములోని శుద్ధ సత్తాయేం పరబ్రహ్మము. అదియేం పంచేంద్రియములను, మనస్సును స్వాధీనమందుంచు కొనునది. పరిపాలించునది. అదియే సాయి. అదియే ఈ జగత్తు నందుకల వస్తువులన్నిటి యందు వ్యాపించి యున్నది. అదిలేని స్థలము లేదు. అది తాను సంకల్పించుకొనిన కార్యమును నెరవేర్చుటకు భౌతిక శరీరము వహించెను.

దానిని నెరవేరిన పిమ్మట శరీరమును విడచును. సమస్త చేతన, అచేతనములయందు కూడా వుండి వానిని నియమించు వారునూ, పరిపాలించు వారునూ వారే. ఈ విషయము ఇప్పటికినీ సర్వస్య శరణాగతి చేసిన వారికినీ మనస్ఫూర్తిగా భక్తితో పూజించిన వారికినీ అనుభవనీయము

**– షిరిడీ సాయిబాబా**

10) భగవంతుని యందు భక్తి మాత్రమే జ్ఞాన పరమార్థాన్ని ప్రసాదించి. సర్వ మాలిన్యాలను పరిహరింప చేయగలదు. భక్తుడు భగవానుని, ఏ పరిస్థితులో, ఎటువంటి మనస్సుతో, ఏవిధంగా ధ్యానించినా భగవానుడు వారిని ఆ మార్గములో నడిపించి, తన చెంతకు చేర్చుకొని, తన స్పర్శతో పరమపదాన్ని అనుగ్రహిస్తాడని మాత్రం మరచిపోకూడదు. **– భాగవతం**

11) ధర్మం వలన భక్తి కలుగుతుంది. భక్తి వలన వైరాగ్యం, వైరాగ్యం వలన జ్ఞానమూ కలుగుతాయి.

జ్ఞానం సాక్షాత్కార రూపమైనది. అది శుద్ధ తర్కాలవల్ల సిద్ధించేదికాదు. ఎప్పుడు బుద్ధి ఏకాగ్రమవుతుందో అప్పుడు జ్ఞానం ఉదయిస్తుంది. ఎప్పుడు పరవిషయప్రీతి నశిస్తుందో అప్పుడు బుద్ధి ఏకాగ్రమవుతుంది. అటువంటి ప్రీతి నాశాన్నే వైరాగ్యం అంటారు. వైరాగ్యంతో పాటు పరమార్థ ప్రీతి ఉండాలి. ఆ పరమార్థ ప్రీతినే భక్తి అంటారు. అటువంటి భక్తిని కలుగజేసేదే ధర్మంకాని ఇతర ధర్మాలు కావు. **– భాగవతం**

12) వేదాంత శ్రవణంచేత సాధ్యంకాని అపరోక్షానుభూతిని కలిగించే ఏక సాధనం భక్తి. అది మొట్ట మొదట హరికథామృతాన్ని ఆస్వాదింపజేస్తుంది. ఆ అమృతాన్ని గ్రోలినంతమాత్రాన చిత్తంద్రవీభూతమవుతుంది. ప్రేమాశ్రువులు చిప్పిల్లుతాయి. పులకాంకురాలతో మేను గగుర్పొడుస్తుంది. ఈ చిహ్నాలన్ని అపరోక్ష సాక్షాత్కార లక్షణాలు. భగవత్తత్వానుభవానికి నిదర్శనలు. ఇటువంటి అనుభూతి వేదాంత శ్రణాదులవల్ల కలుగలేదు. కనుక అది భక్తికి సాటిరావు.

13) వైరాగ్యంతో భగవద్దర్శన కాంక్షారూపమైన అనురాగం తీవ్రతర మవుతుంది. అనురాగాన్నె భక్తి అంటారు. ఆ భక్తి క్రమక్రమముగా వృద్ధిగాంచి చిత్తాన్ని భగవత్పరం చేస్తుంది. అప్పుడు భగవానుడు మనలోనే క్షేత్రరూపంలో ఉన్నవాడు దర్శనాన్ని ప్రసాదిస్తాడు. దీనినే అపరోక్ష సాక్షాత్కారం అంటారు

– భాగవతం

14) సర్వమూ భగవత్ రూపమేనన్న విశ్వాశాన్ని సంపూర్ణంగా కలిగి యుండటం ప్రథమ లక్షణం చరాచర భూత జాతంలోనూ భగవంతున్ని చూడటం ద్వితియ లక్షణం. ఏకాగ్రమైన బుద్ధితో నిరంతరం భగవత్ కథలను వినటం, ఆయన నామాన్ని సంకీర్తించటం, ఆయనను పూజించటం, ధ్యానించటం మూడవ లక్షణం. త్రికరణ శుద్ధిగా తనను తాను భగవంతునికి సమర్పించుకొని, జీవితాన్ని గడపటం పరమ లక్షణం. ఇటువంటి లక్షణాలతో కూడిన వర్తనను భక్తి అంటారు. – భాగవతం

15) నిర్గుణ భక్తి :- నిర్గుణ భక్తిని పరాభక్తి అని, ఆత్యంతిక భక్తి అని పేర్కొంటారు. ఈ భక్తిలో ఫలాపేక్షకాని, భేద దర్శనంకాని వుండవు. సర్వగుణాలకు నేను ఆశ్రయుడను కనుక నా గుణ వర్ణను చెవిసోకినంతనే నిర్గుణ భక్తుని మనస్సు నా వంకకు అవిచ్ఛిన్నంగా ప్రవర్తిస్తుంది. ఇది నిర్గుణ భక్తి యోగానికి ప్రధాన లక్షణాలు. – భాగవతం

16) భక్తిఫలభేదాలు :- సగుణ భక్తులు నా రూపాలను ధ్యేయంగా పెట్టుకొని నన్ను ఆరాధిస్తారు నిర్గుణ భక్తులు నా తత్వాన్ని ధ్యేయంగా గ్రహించి ఆరాధిస్తారు. సగుణ భక్తులు వారి, వారి భక్తి విశేషాలను బట్టి సాలోక్యా సమానైస్వర్యం, సామీప్యం, సారూప్యం, సాయుధ్యాలను కోరి నన్ను భజిస్తారు. నేను వారికి తత్ భక్తి యోగ్యమైన సాలోక్యాదులలో ఏదో ఒకటి అనుగ్రహిస్తాను. అంతటితో వారికి తృప్తి కలుగుతుంది.

నిర్గుణ భక్తులు ఏదీకోరరు. సాయుజ్యం ఇద్దామన్నా వద్దంటారు. నన్నుసేవించే భాగ్యం ఒక్కటే వారికి పరమకాంక్ష గా యుంటుంది.

త్రిగుణాలను దాటి బ్రహ్మ భావాలను పొందాలంటే నిర్గుణ భక్తి ఒక్కటే పరమోపాయం.

నిర్గుణ భక్తుని జీవిత విధానం :- అతని పూజా విధానం శ్రద్ధా యుక్త మై నిష్కామమై యుండటమే కాదు. అతను గోరంత హింసకు కూడా ఎడమీయడు. నా ప్రతిమలను దర్శించినా, వాటికి పూజా స్థితి వందనాదులను గావించిన అతనికి పండుగగా యుంటుంది. అతను సర్వ భూతముల యందును భగవత్ భావనా పరాయణుడై యుంటాడు. విన్ను మీద పడిన ధైర్యాన్నివదలడు. అతని వైరాగ్యం వర్ణనాతీతం. మహాత్ముల సేవ, దీనులయడ కారుణ్యం, సాటివారి యందు ప్రేమాదరాలు అతనికి నైజగుణాలు. **భాగవతం**

17) భగవత్ భక్తుడగుచు నీ చిత్తమును నాకు సమర్పింపుము. సమస్త కార్యముల యందును భగవత్ స్వరూపుండనగు నన్నే జ్ఞప్తియందుంచు కొనుము. నన్ను గూర్చి నమస్కారము చేయుము. నీవటు చేయుదువేని నా ఈ సచ్చిదానంద స్వరూపమున నిత్యసేవకుడవు అగుదువు. ఇదియే నా ప్రతిజ్ఞ. నీవు నాకు అత్యంత ప్రియుడవనుచు నీకు ఈ నిర్గుణ భక్తినే ఉపదేశించు చున్నాను. **- భగవద్గీత**



# 17
## అహంకారము

1) నన్ను నీవు కలుపు కోమని పైకి వెళ్ళినదే ఉచ్ఛ్వాసము అన్నారు. అర్పణ అంటూ చేసిన తరువాత ఇక అక్కడ మిగిలేది ఏమి వుంటుంది? అంతా అయినదే భక్తి, జ్ఞానము తీసి కెళ్ళేవిగమ్యాలు రెండు కావు - ఒకటే. పోవలసినది అహంకారము నేను వేరుగా యున్నాను అను భావము పోవాలి. అంతే కాని ప్రపంచము కాదు. వున్నది అంతా అయిన ఆత్మ - పరమేశ్వరుడే.

**- జిల్లెలమూడి అమ్మ**

2) యదార్థ మేమిటంటే చైతన్యానికి, జడానికి - అనగా ఆత్మకి, దేహానికి మధ్య మూడవదొకటి పుట్టుకొస్తోంది. దాన్నే "మిధ్యా నేను, అహంకారము, మనస్సు, అవిద్య, అజ్ఞానము" అంటున్నాము. ఇది సర్వజ్ఞతగల ఆత్మకాదు. జడమైన దేహము కాదు. దీనికి జడ చైతన్యాలు రెండూవున్నాయి. ఈ మనస్సు ఆత్మ సన్నిధిలో పని చేస్తుంది. జడ చైతన్యాలు రెండూవున్నాయి. ఈ మనస్సు నాశన మవగానే కర్మకలాపం ఎటువంటి ప్రయత్నము లేకుండా అతి సహజంగ సాగిపోతుంది. మనస్సు చేసే పనులు ఆత్మ చేస్తుంది. అతి సవ్యంగ, అతి సమర్ధ వంతంగ మనస్సు చేసినట్టు కోతి పనులు - అవక తవకలు లేకుండా చేస్తుంది. ఆత్మ తన అత్యద్భుత శక్తి చే ఈ అనంతమైన విశ్వాన్ని సృష్టించింది. అయినా ఆత్మయేమి చేయనిదిగా వుండి పోతుంది.

**- రమణ భగవాన్**

3) ప్రశ్న :- **ఈ చావు పుట్టుకలు నుండి తప్పుకోవాలంటే ఉపాయం ఏది?** వచ్చినదారిని వెళ్ళడమే. అనగా ఏ ఆత్మలో నుండి ఈ అహం వృత్తి పుట్టిందో ఆ ఆత్మలోనే ఈ అహం వృత్తిని లీనం చేయడం. ఆత్మ అనుగ్రహ స్వరూపుడు. అది నీలోనే యున్నది. నిన్ను ఆకర్షిస్తోంది. కొంచెం "లోచూపు" కలిగితే చాలు, నిన్ను తనలోనికి లాక్కుంటుంది. అక్కడితో జనన, మరణ, చక్రము నుండి తప్పుకుంటావు. దివ్య శాంతివే నీవై మిగులుతావు. **- రమణ భగవాన్**

4) అహంకారము రెండు విధములు (1) పక్వము (2) అపక్వము.

నా దేమియు లేదు. నేనేమి చూచినను, చేసినను, అనుభవించినను, వేయేల - ఈ శరీరము సైతము నాది కాదు. నేను నిత్యముక్త బుద్ధ స్వరూపుడను. ఇట్టి భావములతో నున్నది పక్వమైన అహంకారము. ఇది నా ఇల్లు నా బిబడ్డలు, నా భార్య, నా తనువు - ఈ విధమైన భావన కలుగచేయునది అపక్వమైన అహంకారము. **- రామకృష్ణ పరమహంస**

5) నే నెరుగుదును అని గాని, ఎరుగను అని గాని, పలుకుచున్నంత వరకూ నరుడు తానొక వ్యక్తినని భావించు చుండును. "నీలోని ఈ అహంకారమును నేను (దేవి) తొలగించి నప్పుడే (పూర్తిగా) అఖండ బ్రహ్మ సాక్షాత్కారము సమాధి స్థితి యందు గలుగ కలదు. అని నా జగత్ జనని పలుకు చున్నది. అంత వరకు "నేను" అనునది నాలోనూ నా ఎదుటను గూడా నిలచియే యుండును. **- రామకృష్ణ పరమహంస**

6) అహంకారము నిర్మూలమైనంతనే జీవత్వము నశించును. అంతట సమాధి స్థితిలో బ్రహ్మ సాక్షాత్కార మగును. కావున బ్రహ్మానుభవము నొందినది బ్రహ్మమే కాని జీవుడు కాడు. **- రామకృష్ణ పరమహంస**

7) సత్వ, రజస్తమో గుణములన బడు ప్రకృతి జనితమగు గుణములచే పలువిధములగు కర్మలాచరింప బడుచున్నవి. అహంకారము చేమూఢుడగువాడు తానే కర్తయని భావించును. **- భగవత్ గీత**

18

## ప్రణవము

1) తారక మంత్రమగు (ప్రణవము) సామాన్య శబ్ధముకాదు. సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపము. అటులనే పవిత్రతను, భక్తిని కోరుకొనుట క్షుద్రమగు లౌకిక వాంఛలతో పోల్చదగదు. **– రామకృష్ణ పరమహంస**

2) సాంప్రదాయ సిద్ధమై పరంపరగా వచ్చిన ఈ బ్రహ్మ విద్య నిర్గుణ బ్రహ్మమును బోధించు పరవిద్యయనియు, ధర్మఫలసాధనమగు సగుణ బ్రహ్మమును బోధించు అపర విద్య యనియు ఇందులో రెండు భాగములున్నవి. ఇవి రెండునూ శౌనకుడు ఆంగీరసునకు ఉపదేశించెను. బ్రహ్మజ్ఞానము పరవిద్య యొక్క ముఖ్య లక్షణము. స్వర్గమే దాని ఫలము. స్వర్గము కోరు వారికి కర్మా చరణమే ముఖ్యమార్గము. సమస్త కర్మలకు అగ్ని హోత్రము. ముఖ్యము. కర్మాచరణవల్ల చిత్తశుద్ధి కలుగును. ఇది పరవిద్యకు అత్యంత ఆవశ్యకమగు పూర్వాంగము. అంతఃకరణమును బాహ్యములగు స్వవిషయముల నుండి మరల్చి వైరాగ్యముచే చిత్త కాలుష్యము పోగొట్టుకొన వలెను. అట్టి నిర్మలమగు చిత్తమునందు ఓంకారోపాసనచే ఏకాగ్రతను సమకూర్చవలెను. **– ముండకోపనిషత్తు**

3) ఈ ఉపనిషత్తు సర్వ వేదాంత సారము అన్నిటికంటెను గంభీరమైనది.

బ్రహ్మ విద్యను బోధించుటలో ఇది ముఖ్యమైనది. శబ్ధములన్నియు ఓంకారము కంటే వేరుకావు. బ్రహ్మ ఓంకార శబ్ధ వాక్యమగుట వలన ఓంకారము బ్రహ్మము కంటే వేరుకాదు. పరోక్షంగా కనిపించు బ్రహ్మమే అపరోక్షమగు ఆత్మ. నేను, నేను అని సర్వ సామాన్యముగ తెలియవచ్చు ఆత్మ రెండూ ఒకటే. అవస్థాత్రయము ఒకదాని తరువాత ఒకదానిలో తనను అనుసంధానము చేసికొనగా ఆయా అవస్థల అనుభవించు చున్నది. **– మాండోక్యోపనిషత్తు**

4) అకారాది సూత్రత్రయమునందు తానుకూడా నున్నాడను సత్యమును గ్రహించి ఓంకారోపాసన చేయువాడు సర్వ వంధ్యుడు అగునని ఓంకారోపాసన యొక్క ఉత్కృష్టత తెలుపుచున్నది. ఓంకారము శాంతము, శివము అద్వైతము. ఇట్టి జ్ఞానము వలన బ్రహ్మాత్మైక్యము పొందవచ్చును. ప్రణవము సృష్టి, స్థితి, లయకారణము. శోకనాశకము. ఓం కారతత్వమును తెలుసుకొని మననము చేయువాడు పరమాత్మ తత్వమును తెలుసుకొనినవాడగును. అద్వైతము నందు సర్వమూ పరబ్రహ్మమే అగుట వలన ఆనికి దేనితోనూ విరోధము లేదు. ద్వైత మతములు రాగద్వేషాది అభిమాన పూరితములు. అద్వైతము పరమార్థము. ద్వైతము మనఃకల్పితము. **– మాండూక్యోపనిషత్తు**



19

## అవతారము

1) అవతారమూర్తి అంతకు మునుపు నీరు దొరకని తావున క్రొత్తగా బావిని త్రవ్వు మహా యంత్రకారుని వంటివాడు. సిద్ధుడు మోక్షజలము దాపుననున్న వారికి మాత్రమే దానిని ఒసగ గలడు. అవతార మూర్తియె ఎవని హృదయము బొత్తుగా భక్తియను మాటయే లేక ఎడారివలే సుష్కమై యుండునో అట్టివానిని సైతము తరింపజేయగలడు.

2) ఉప్పెనవచ్చి నదలును, కాలువలను, పొలములను అన్నింటిని ముంచి వేయును. వాననీరో మామూలు కాలువ వెంబడిని మాత్రమే ప్రవహించును. ఇటులనే అవతారమూర్తి వేంచేయునప్పుడు వాని కృపచే ఎల్లరును తరింతురు. కాని సిద్దులో జప తపములనొనర్చి యంతయొ శ్రమపడి తాను మాత్రమే తరింపగలరు.

3) రైలింజను తాను వేగముగా పోయి గమ్య స్థానము చేరుటయేగాక సరుకు బండ్లనెన్నింటినో తనతోలాగుకొని పోగలుగుచున్నది. అవతారమూర్తులిట్టివారు. పాప భారముచే కృంగియున్న జన సమూహములను వారు (దైవము) భగవత్ సన్నిధానమునకు కొనిపోగలరు. - రా.కృ. పరమహంస

4) కారణం లేకుండా అన్నీ తానేయై, అన్ని కారణాలు తానేయై, తనకై

వచ్చిందే సంపూర్ణ అవతారము. ఒక్క కారణము చెప్పి వచ్చేది - కారణావతారము. ప్రతి వాడూ అవతారియే కాని టైం (కాలము) రావాలి. అందరూ ఒకే తడవ అయితే - ఇంక సృష్టి దేనికి? టైం వచ్చినప్పుడు వాళ్ళూ

**– జిల్లెలమూడి అమ్మ**

5) ఇప్పుడు ఒక నాటకం వుందనుకో - ఆ నాటకం వ్రాసినవాడూ పాత్రను ధరించాల్సి వస్తుంది. అందులో దుఃఖ పాత్ర వస్తే - అది, ఏ పాత్రవస్తే అది - వెయ్యాల్సిందేగా ! తానే వ్రాశానని తనకు తెలుసు, అన్నీ తనకు తెలుసు. కాని పాత్రధారణ, వ్రాసేటప్పుడు కర్టెను (తెర) తానెయై, ప్రేక్షకుడు తానై, నాటకం తానై, చేయించేది తానెయై అన్నీ తానేయై వ్రాస్తాడు. కాని ఏ పాత్రను వెయ్యాల్సివచ్చినప్పుడు ఆ పాత్ర వేస్తాడు **– జిల్లెలమూడి అమ్మ**

6) ప్రశ్న :- **ముక్తుడికి, అవతారానికి తేడా ఏమిటి?**

అమ్మ :- ముక్తుడు సంకల్ప రహితుడు. అవతార వ్యక్తి సంకల్ప సహితుడు. **– జిల్లెలమూడి అమ్మ**



## 20
## పురుష ప్రయత్నము

1) మనకు స్వతంత్ర్యము లేనిచో జపతపములు మున్నగు సాధనలు అవుసరం లేదా? ఏలన అంతయు ఈశ్వరేచ్ఛయే! ఏమి జరిగిననూ వాని సంకల్పము వలననే జరుగుచున్నది. అని ప్రతివ్యక్తియు కాళ్ళుచాచుకొని కూర్చుండ వచ్చునా?

గురుదేవులు :- ఎంత వరకు ఆ మాట! వూరకనోటి మాటగ అనిన జాలున ! ముండ్ల కంపమిాద చేయవేసి "ముండ్లులేవు, ముండ్లు లేవు" అనుకొనిన ముండ్లుగుచ్చుకొనుట మానునా! పారమార్ధిక సాధనలు చేయుట పూర్తిగా తన యంధీనంలోనే నున్న పక్షమున ప్రతివ్యక్తియు అట్లుచేయుచుండెడివాడే. అయినను ప్రతివ్యక్తి చేయజాలడు. ఎందుచేత? భగవంతుడు నీకిచ్చిన శక్తిని సద్వినియోగము చేసిన కాని నీకాయన అధికముగా ఇవ్వడు. అందుచేతనే పురుష ప్రయత్నము యొక్క అవశ్యకత. కాబట్టి భగవదనుగ్రహము పొందుటకైనను ప్రతి వ్యక్తియు శ్రమపడి, కృషిచేయ వలసి యున్నది. అట్టి పురుష కారము వలనను, వాని అనుగ్రహము వలనను, అనేక జన్మములలో అనుభవింప వలసిన కష్టములను, దుఃఖములను ఒక్క జన్మలోనే తీరిపోవుచుండును. ఏమైనను కొంత పురుష ప్రయత్నమత్యావశ్యకము. – రామకృష్ణ పరమహంస

2) ఏర్పడిన దానిని వివరించేది పరమాణుసైన్సు. ఏర్పడడానికి ఆధారమైనది పరమార్థం. **– జిల్లెలమూడి అమ్మ**

3) తను చేసే పనులలో ఏదో వున్నదనుకోకపోతే బ్రతకలేడు. మానవుడికి మిగిలింది అదొక్కటే - తాను చెయ్యకపోయినా చేశానని అనుకోవడం.

4) ఇదంతా చేస్తున్నది తాను కాదు అనుకొన్నప్పుడు తాను నిమిత్తమాత్రుడేగా ! కర్మలన్ని చేయడానికి తాను స్వతంత్రుడై ఆ అధికారం తన చేతిలో వున్నప్పుడు తాను ఎందుకు చేయలేడూ ?

మానవ యత్నమంటూలేదు. ప్రయత్నం వెనుక ప్రేరణ వున్నది. ఆ ప్రేరణ నేనే. మనం అనుకున్నట్టు జరిగితే పురుష ప్రయత్నం. వాడి ఆటలోనున్న మనం మనదేదో వుందని బాధ పడుతూ వుంటాం. ప్రతి మానవుడుకి జరగవలసిన పనులు పుట్టుకతోనే వస్తాయి. మధ్యలో మారవు.

ప్రశ్న :– **కొంతమనం చేసుకొనే పనులలో వుంది - అంటారు కదమ్మా?**

అమ్మ :- వీళ్ళ పనుల్లోనే వుండేటట్లయితే సుఖపడే పనులు చేసుకోవడానికి ఎందుకు బుద్ధి పుట్టదు? **– జిల్లెలమూడి అమ్మ**

5) సామాన్యముగ ఆధ్యాత్మిక సాధనలో భక్తి, విశ్వాసము, కుదురుకొనుటకు ముందు పురుష ప్రయత్నము ముందా, లేక దైవకృప ప్రధానమా అనే సందేహము పొడచూపుట సహజము. భగవంతునియందు దృష్టి మరల్చి అతనియందే విశ్వాసమును నిలుపుకొనుటకు ఈ చంచల మనస్సు అనేక సంశయములను లేవనెత్తుతు విశ్వాసమును కుదురనీయకుండ చేయుట ఈ మనస్సు యొక్క స్వభావము అంటే విత్తుముందా, లేక చెట్టు ముందా? అనే సంశయమును లేవనెత్తుతు తమ పూర్వ సంశయములకు బలమును చేకూరుస్తూ, సుష్కతర్కమునకు తావిస్తూ, జీవితమంతా వృధాకాలయాపన చేయుట కూడా కలదు. గీతలో సంశయాత్మ వినశ్యతి అన్నట్లు సంశయములతో కూడిన మనస్సు వినాశన హేతువు. చెట్టు,

విత్తనము, ఒక దానిలో ఒకటి ఇమిడియున్నాయి. రెండింటిలోనూ ఒకే శక్తి యున్నది. అలాగ పురుష ప్రయత్నము, దైవానుగ్రహము ఒక దానితో ఒకటి ముడిపడి వున్నాయి. లక్ష్మి నారాయణ, పార్వతి పరమేశ్వరులు ప్రకృతి పురుషుడు ఎట్లా ఒకదానితో ఒకటి ముడిపడి వున్నాయో అట్లాగే దైవానుగ్రహము, పురుష ప్రయత్నము ఒకదానితో ఒకటి సమ్మిళితమై యున్నవి. పురుష ప్రయత్నమునకు ఆధారము దైవాను గ్రహము. దానిని పొందాలంటే పురుష ప్రయత్నమవసరము. భగవాన్ సత్యసాయి చెప్పినట్లు రైలుపెట్టెను ఇంజనుకు తగిలించటమే నీవంతు. తరువాత ఆ ఇంజనే ఆ పెట్టెను తీసుకొని పోవును గమ్య స్థానమునకు. అటులనే భగవంతుడు నాటిన భక్తి బీజమును మనము మన ఆధ్యాత్మిక సాధనద్వారా ఆయనవైపు ప్రయాణిస్తే దైవకృషతోడై మనలను మనకు తెలియకుండానే తనవైపుకు లాగుకుంటారు. శిరిడీసాయిబాబా చెప్పినట్లు "నీవు నావైపుకు ఒక అడుగు ముందుకు వస్తే, నేను పది అడుగులు ముందుకు వచ్చి నిన్ను నావైపుకు నడుపుకుంటాను" అందుచే ఆధ్యాత్మిక సాధనలో మానవుడు తనవంతు కృషిచేయవలెను. దైవకృప గురించి ఆలోచన అనవసరము ఏమంటే భగవంతునివైపు నీ మనస్సు మరలడమే దైవకృపకు నిదర్శనము అన్నారు రమణ భగవాన్ **– ఒ భక్తుడు**

*P.S.N. Murty*



## 21

# అద్వైత జ్ఞానము

1) అద్వైత జ్ఞానము కలిగినచో చైతన్యము కలుగును. అట్టితరి సర్వభూతములలోనూ చైతన్య శక్తినే గాంచును. చైతన్య రూపములోనే భగవంతుడు విరాజిల్లుచున్నట్లుగాకాంచును. ఇట్లు చైతన్యము కలిగిన తరువాతనే ఆనందము పొందును. అందుచేతనే అద్వైతము - చైతన్యము - నిత్యానందము ఒకదాని తరువాత ఒకటి పొందవచ్చును – **రామకృష్ణ పరమహంస**

2) పాపం, పుణ్యం - విచక్షణ ఏముంది? రెండని నేనుకోవటం లేదు. అదిన్నీ వీడి (మానవుడి)కి వుందనుకోవటం లేదు. – **జిల్లెలమూడి అమ్మ**

3) శంకరాచార్యుడు స్తోత్రము చేయని దేవుడంటూ లేడు, దేవీ అంటూ ప్రతి ఒక్కరినీ స్తోత్రం చేశాడు. ప్రతి ఒక్కరినీ వర్ణించాడు. అందరినీ ఒకే అమ్మలో చూశాడు. ఆ అమ్మను తనలో చూశాడు. అది అద్వైతమంటే.

– **జిల్లెలమూడి అమ్మ**

4) అన్నింటిలో ఒకటినే చూడటం అద్వైతం. నీచేత నిన్ను తెలుసుకొని నీవవుతున్నావు. గుర్తుతో గుర్తించి గుర్తు నశించటమే. అంతా అయింది అర్థం కానిది అద్వైతం. దేనికదిగా వుండి అన్నీ తనైనప్పుడు ద్వంద్వమైనటు వంటి ఆనందమేదైతే వున్నదో - అదే అద్వైతం. – **జిల్లెలమూడి అమ్మ**

5) అంతా జీవమయం. నా దృష్టిలో జడమే లేదు. నేను చేస్తున్నాను అనుకునేది మానవత్వం. వాడు ఇస్తున్నాడు అనేది జ్ఞానం - అన్నీతానైనది దైవం. సర్వమూ ఏదో ఒక శక్తి, అమ్మో, దైవమో, శక్తో - మనం కాదు దానికి కర్తలం అనుకున్నప్పుడు అది జ్ఞానం కావచ్చు, భక్తి కావచ్చు. ఈ రెండింటిలో ఒకటి - ఒక వస్తువుమీద విశ్వాసం చూపించినపుడు భక్తి అనుకుందాము. లేదూ - దానంతట అది తెలిసినప్పుడు జ్ఞానం అని మనం అంటూన్నది దాన్నే. ఇంకోటి దైవం వున్నది. ఎవరిమీదో బాధ్యత వేశాము అనుకున్నప్పుడు భక్తి. మనదికాదు కర్తవ్యం. మనకర్థం కానిది ఏదో వున్నదనుకున్నప్పుడు జ్ఞానం. ఇదంతా నాది (నీది) అనుకున్నప్పుడు మానవత్వం సర్వమూ తానైనప్పుడు దైవము రామనుజుడు తన దైవాన్ని చూశాడు. శంకరుడు తనలో దైవాన్ని చూశాడు.నేను నీవుగావున్న అహంకార బ్రహ్మ. నేను నేనుగా వున్న అహంబ్రహ్మాస్మి. తనలో నేననేదే అంతటా వున్నది. కర్మ క్రియ కర్తలోవే మొదట్లో (అంటే తెలియ నప్పుడు) మౌనం. చివర (తెలిసినప్పుడు) మౌనం. జ్ఞానమే భగవంతుడు. సర్వాన్నీ తెలుసుకున్న తెలివే జ్ఞానము.

**– జిల్లెలమూడి అమ్మ**

6) ప్రశ్న:– **జ్ఞానానికి, ప్రేమకు సంభంధం ఏమిటి?**

అమ్మ:– ప్రత్తికి దారానికి వుండేసంబంధమే. రెండూ ఒకే పదార్థమైనా ప్రత్తిని చూస్తే దారం జ్ఞప్తికిరాదు. దారాన్ని చూస్తే ప్రత్తి జ్ఞపికిరాదు.

ప్రశ్న:- **పతనము?**

అమ్మ:- పతనమనేదే లేదు. ఒక మెట్టు ఎక్కిన తరువాత అది నిజమైన జ్ఞానమైతే మళ్ళీపోదు. **– జిల్లెలమూడి అమ్మ**

7) ఇది కాదు, ఇదికాదు- అంటూ అంతా అదే అనటం (బి) అంతా అయినది అర్థం కానిది అద్వైతం. అన్ని రూపాలు ఆయనవే కనుక

రూపరహితుడు. అన్ని గుణాలు ఆయనవే అనుక గుణ రహితుడు. అన్ని నామాలు ఆయనవే కనుక నామరహితుడు. అన్ని సంకల్పాలు ఆయనవే కనుక సంకల్ప రహితుడు. **- జిల్లెలమూడి అమ్మ**

8) జ్ఞానము అంటే తెలుసుకున్నది. కనిపించేది అంతా దైవం, అనుకోవటమే జ్ఞానం. చేస్తే వచ్చేది కాదు. ఇస్తే వచ్చేదే. ఈ ఆలోచన ఎవరిచ్చారో వాళ్ళే ఇస్తారు. అన్ని ఒకటిగా గుర్తించేవాడు జ్ఞాని. అన్నీ తానైనవాడు దైవం. సర్వాన్నీ శక్తిమయంగా చూడగలగడమే జ్ఞానం. నడవనివ్వని శక్తులన్నీ నడిపించే శక్తి మీదే ఆధారపడి వున్నాయి. అందర్ని తానుగా చూచినా, తనలో అందర్ని చూచినా ఒకటే. చిన్నకాయ భక్తి. పెరిగినప్పుడు యోగం. పండినప్పుడు జ్ఞానం. గుర్తించేవాడు గుర్తింపబడేది వేరుగాదు. ఇచ్ఛాశక్తి, క్రియాశక్తి జ్ఞానశక్తి నీవే అన్నారుగ - అన్ని శక్తులు అదే. - జిల్లెలమూడి అమ్మ

9) జ్ఞాని ప్రజ్ఞ (వివేకము) అను మేడపైనెక్కి స్వతః శోకరహితుడై (అజ్ఞానులగు) జనులను, గూర్చి శోకించును. మరియు పర్వతం పైనున్నవాడు భూ తలంపైనున్న వారిని వీక్షించినట్లు (అతడు ఉన్నత వివేకస్థితియందున్నవాడై) సర్వులను వీక్షించును. - యోగవాశిష్టం

10) "నేను" అనుభావము పోయి (పరమేశ్వరా! అంతయు) "నీవే నీవే" అను భావము కలుగ వలయును. జ్ఞానోదయమైననే కాని ఈ స్థితి ప్రాప్తముకాజాలదు. - రామకృష్ణ పరమహంస



22

## ఆలోచనలు

1) ఆలోచన వచ్చిన తరువాత (వచ్చినదని) తెలుస్తున్నది. కాని ఎక్కడ నుంచి వచ్చింది ఎట్లా వచ్చింది తెలియ లేదు. కూర్చుందామనిపించింది. కూర్చున్నాను. ఆ అనిపించింది (ఎవరివల్లో) అర్థం కావటం లేదు. ఆ అనంతమైన శక్తిని పరిమితి గల (శరీర) ఆకారంలో చూదామనే కదా ప్రయత్నం.

ఆలోచనలెట్లా వచ్చినవి. ఏదో శక్తో, దైవమూ, ఏదో ఒకటి ఏర్పరచాలి. ఆ శక్తికి ఆకారము వుండాలి కదా! (పూర్వజన్మ కర్మ వల్ల అంటారు. అయితే) మొట్ట మొదటి జన్మలోని ఆలోచనలు ఎక్కడ (నుంచి) వచ్చినవి - పాప పుణ్యాలు వున్నాయనా! అదే కారణం. ఆ శక్తి కారణం **- జిల్లెలమూడి అమ్మ**

2) ఆలోచనలు మెదడుకు స్వభావ మంటాడు నాస్తికుడు. ఆ స్వభావమే భగవంతుడు అంటాను నేను.

తరుణమే రుణం **జిల్లెలమూడి అమ్మ**

**3) ఆలోచనలు మానవుడివికావా అమ్మ?**

అమ్మ :- వీడివే అయితే ఆలోచనలు లేకుండా వుండమను. ఎంతసేపు వుండగలడో? లేదూ - ఒకే విషయం గురించి - ఆ భగవంతున్ని గురించే అను - ఆలోచించమను. ఎంతసేపు ఆలోచిస్తాడో?

ఆలోచన చేయించేది ఆయనే. మార్చేసేది ఆయనే.

యమేవైష వృణుతే తేన లభ్యః అంటే అదేనా అమ్మ

అమ్మ :- ఆయనే నీచేత ఈ ప్రశ్నవేయించాడు. నీ తెలియని తనానికి, కారణం నేను. నీచేత తెలియ పరచుకోవలసింది నేను నువ్వు చెయ్యి అనేది లేదు. **– జిల్లెలమూడి అమ్మ**

4) ఆలోచనలు లేని స్థితి - ఆలోచనలు రాక మానవు. ఆపుదామన్నంత వరకూ యత్నం వుంటుంది. ఆ స్థితి వచ్చినప్పుడు అతనికి అంతా సహజంగా వుంటుంది. నిమిత్త మాత్రునికి అన్నీ సమానమే. ఏ ఒక్కటీ ప్రధానంగా కనపడదు. అన్నిటికీ ఒక్కటే ప్రాముఖ్యత - నిర్లిప్తత. అంటే అంటీ అంటని స్థితి. భక్తికి సవికల్ప సమాధికి తేడా లేదు. **– జిల్లెలమూడి అమ్మ**

5) సంకల్పమే దైవమన్నాను. మారినది వికల్పం. జరిగేది జరుగనివి వస్తున్నాయి. స్థాయి వుందికదా! శరీరానికి అవసరాలు, మనస్సుకు ఆలోచనలు. అందులో కూడా శరీరానికి సమానమైన ఆలోచనలే. పసివాని ఆలోచనా స్థాయివేరు. వయసుగల వాని ఆలోచనా విధానం వేరు. ఒకే మనిషికి కొన్నాళ్ళ తర్వాత అభిరుచివేరు. వ్యష్టిత్వంలేకపోతే సృష్టిలేదు. ఎక్కడికక్కడ పాయింట్లే. నిలిస్తే చుక్క సాగితే గీత. గీచేది దానికంటే అది వేరుగా వుంటుంది. ఒకటి, రెండు, మూడు విడదీస్తే ఏ ఒకటికి ఆ ఒకటే. ఒడ్ల గింజ ఒకటే. మొలిస్తే నారు. పెరిగితే పైరు. వామిలో గడ్డి, పశువుల దగ్గర మేత. అదే పాలు, అదే రక్తమైనది రూపాంతర మైనప్పుడే భిన్నత్వమున్నది. గుర్తించక. పోయినా గుర్తు తానే కనుక ఏమీలేదు. సృష్టియే గణితం. సైన్సు ప్రకారం శరీర నిర్మాణం గణితం.

**– జిల్లెలమూడి అమ్మ**

6) ప్రశ్న :- **కర్తృత్వం ఎవరిది?**

అమ్మ :- ఆ శక్తిదే. ఆశక్తి కర్తృత్వం కింద ఆడబడే వాళ్ళమే. ఒక విధమైన బొమ్మలమే దానిలో తెడాలెలా వసాయి? ఈ మర చిన్నది కావచ్చు ఆ చక్రం పెద్దది కావచ్చు. పెద్దా చిన్నా పైకి కనిపించటమే తప్ప అందరూ, అన్నీ, అంతా అయిన శక్తి నడిపిస్తేనడిచేదే. **– జిల్లెలమూడి అమ్మ**

23

## విధి నిర్ణయము

1) విధి అంటే తప్పనిసరి. విధి అంటే విధానమే. విధి వర్షం లాంటిది. కొందరికి అనుకూలంగాను, కొందరికి ప్రతికూలంగాను వ్యవహరిస్తుంది. గుణాలు కూడా కాలానికి కట్టుబడి వున్నాయి.

ఎవ్వరు మనకున్న దానిని వదిలించలేదు. లేని దానిని తెచ్చిపెట్టలేరు. చేతలు నీ చేతులలో లేవు. ఏదైనా ఆచరించటం మన చేతిలో వున్నదా ! ఎప్పుడు ఏది తోస్తే అది చేయడమే. మనకర్థంకాని శక్తి ఏదో ఒకటి వుందిగా ! కాని మన కర్థంకాని శక్తిఏదో ఒకటి వుండి పని చేయిస్తున్నా - మనం చేస్తున్నాం కనుక నేను అనుకోక తప్పదు. మనను నడిపించేది వేరే ఏదో వున్నా - మనకాళ్ళు నడుస్తున్నయి కనుక నడుస్తున్నామని అనుకోక తప్పదు

**– జిల్లెల మూడి అమ్మ**

2) నిర్ణయానికి నిర్ణయించిన వాడు కూడా బద్ధుడే. **– జిల్లెలమూడి అమ్మ**

3) కార్య కారణాలకు కర్తలం మనం కాదు.

పుట్టిడమే కర్మ. నువ్వు చేయడంకాదు - వాడు చేయించటమే.

ప్రశ్న:- **మొక్కు కూడా నిర్ణయంలోదేనా?**

అమ్మ:- అంతా నిర్ణయమే!

ప్రశ్న:- **అప్పుడు ఇక వాడి దయేముంది?**

అమ్మ:- దాహం అయింది. వాడి ద్వారా ఇప్పించాడు అనుకుంటాము.

పతన మేముంది? ఎవ్వరికి, ఎంత అవసరమో అంత వరకూ చేయిస్తాడు. నడిపించేవాడు విధి. నడిచేది విధానము. - జిల్లెలమూడి అమ్మ

4) 1) భావం మారుతుంది - స్వభావం (వాడిచ్చిన గుణాలు) మారదు.

2) వైకల్యంలేని మనస్సే కైవల్యం.

3) జీవము, జీవనము వాడిచ్చినవే.

4) సాహిత్యంతో రాహిత్యం రాదు.

5) పీటలనెక్కిన వారంతా పీఠాధిపతులుకారు. **- జిల్లెలమూడి అమ్మ**

6) మీ అందరి యిష్టప్రకారము నేను నడస్తున్నట్లు కనిపిస్తున్నా, మీ అందరిని నా యిష్టప్రకారమే నడుపుకుంటున్నాను.

7) తనను కన్న వారిమీదకంటె తనుకన్న వారి మీద ప్రేమ ఎకువ.

8) తల్లికి బిడ్డ సొమ్ము, బిడ్డకు డబ్బు సొమ్మమ్మ.

5) భగవంతుడు మనలను ఈ జగత్తులోనికి పంపేటప్పుడు ఈ జీవి ఈ జగత్తులో వుండుటకు కాల పరిమితి, ఆ కాలంలో దానికి సరిపడు ఆహారము ఆ కాలంలో అది చేయవలసిన పనులు అన్నీ నిర్ణయించే పంపిస్తాడు. **- భగవాన్ సత్యసాయి**



24

## ప్రేరణ

1) ప్రేరణను మీరు ఏదైనా అనండి- ప్రారబ్ధంఅని గాని, భగవంతుడు అనిగాని, మరేదైనా సరే. లేకపోతే వీటన్నిటికి కారణం మనమే అనండి. అంతా నేనే చేస్తున్నాను అని కాని లేదూ అంతా మనదికాదు ఎదో శక్తి చేయిస్తుంది అని కాని అనుకోండి.కాని కోంత ఏదొ శక్తి చేయిస్తుంది. అనుకోవటం చిక్కే. అందులో ఏదో ఒకటి అనుకుంటె పరవాలేదు. **– జిల్లెలమూడి అమ్మ**

2) కాళ్ళు నడుస్తున్నాయి కనుక మనమే నడుస్తున్నాం అనుకుంటాము. కాని నడిపిస్తున్న శక్తి అర్థం కావటం లేదు. ప్రేరణ అర్థంకాదు. ప్రయత్నం అర్థమవుతుంది. (అది దైవానిది అది కనపడదు. ప్రయత్నం మనది కనుక కనిపిస్తున్నది.) **– జిల్లెలమూడి అమ్మ**

3) సంకల్పం రావటానికి ఆధార మేమిటి?

అమ్మ:- ప్రేరణే. సంకల్పం వచ్చిన తరువాత చేసేది ప్రయత్నం. ప్రేరణకాధార మేమిటి? ప్రేరణే దైవము.

పడడానికి, పడకుండా వుండడానికి, పడినా దెబ్బలు తగలకుండా వుండడానికి ఈ మూడింటికీ కారణం ఒకటేగా (దైవమే) (జిల్లెలమూడి అమ్మ)

4) సర్వమూవాడి ప్రమేయం వలన జరిగినప్పుడు - **కర్మ సిద్ధాంతం?**

మానవుడికి ఎంత వరకు స్థానం?

అమ్మ:- కర్మమనం చేయడం అంటే వాడు చేయించడమే. ఎవరి చేత, ఏపని చేయించినా రెండూవాడే. - **జిల్లెలమూడి అమ్మ**

5) ఆ ప్రేరణ నడిపిస్తున్నట్లు నడుస్తూ, తాము అనుకున్నది జరిగే అవకాశాన్ని గమనించుకొని దాన్ని సాధన అంటారు. ఏవో స్థితులు ఆ శక్తి నిర్ణయంవల్ల ఏర్పడితే వాటిని తామే పొందినాము అనుకుంటున్నారు. స్థితులు పొందటం కాదు. ఏర్పడతాయి

**6) అయితే నిష్కామ కర్మ అన్నది వేరే లేదన్నమాట?**

అమ్మ:- అంతేగా! నువ్వు చేసేదంటూ లేనప్పుడు, నీకర్మ అనేదే లేదు. సర్వమూ ఆ శక్తి ప్రేరణే.

మరి సవికల్ప సమాధి, నిర్వికల్ప సమాధి అంటారే అవన్నీ ఏర్పడిన స్థితులేకాని పొందినవి కాదన్నమాట?

అమ్మ:- అంతేగా మరి. పొందినవే అయితే మళ్ళీ అలాంటి గొప్ప స్థితుల్లోంచి బయటకు ఎందుకు వచ్చినట్టు? ప్రారబ్ధం వల్ల. ప్రారబ్ధం ఎవరిచ్చారు? పూర్వజన్మల్లో చేసుకున్న కర్మ. తొట్టి తొలి జన్మలోని ప్రారబ్ధం ఎవరిచ్చారు మరి. - **జిల్లెలమూడి అమ్మ**

7) ఏదీనీవు చేస్తున్నావని ఎన్నడూ అనుకోవద్దు. నీకు ఏం చేయాలని వున్నా ఆ చేయాలనుకున్న పనికి సంకల్పం కలిగించేది, ఏ పని చేయాలనుకోక పోవడానికి మూలమైనది కూడా ఆ అతీత శక్తే అని నమ్ము నాన్నా.

చేయించేవాడు, చేసేవాడు నీలో ప్రేరణగా మాత్రమే నిలుస్తున్నాడు అవన్నీ వాడెయై చేయిస్తున్నాడు. అలాంటప్పుడు జీవితంలో వచ్చే సుఖ, దుఃఖాలు, లాభ నష్టాలు, చేయించేవాడికేగాని నీకు మాత్రం కావు. అందుచేత నీవు ఏదో చేస్తున్నానని అంతా నావల్లే జరుగుతోందని భావన చేయకు. నీఉనికి ఈ

ప్రపంచంలో నామ మాత్రమే అని తెలుసుకో. చేయించేవాడు, చేసేవాడు వాడే అనుకున్నప్పుడు నీకెలాంటి పాపపుణ్యాలు లేవు.

సృష్టి వికాసక్రమమంతా ఏదో ఒకదాని అంటే (భగవంతుని) ప్రేరణ చేతనే జరుగుతున్నది. ప్రేరణ, సంకల్పము అంతా అదే. ప్రయత్నము, ప్రేరణ వస్తుతః వేరుకాదు. ఒకటే. అంతస్థుని బట్టి, దృష్టిని బట్టి రెండు భిన్నమైనవిగ కనిపిస్తాయి. మానవుడు తన పరంగా ప్రయత్నం అంటాడు. అదే ఈశ్వర పరంగా ప్రేరణ అంటాడు. కాని రెండూ ఒకటే. ప్రేరణ లేనిదే ప్రయత్నం జరుగదు.అమ్మ ఏ సమస్యనైనా వివరించు చుందేకాని విమర్శించటం తల్లి ధర్మంకాదు. కనుక అమ్మ ఎవ్వరినీ శిక్షించటం ఒప్పుకోదు.

**– జిల్లెలమూడి అమ్మ**



## 25
## రూపము

1) ప్రశ్న:- **భగవంతునికి రూపం యొక్క అవసరం ఏమిటి? తను చేయదలచుకొన్నది అక్కడే వుండి ఎందుకు చేయకూడదు?**

అమ్మ:- ఒక నాటకం వ్రాశామనుకో - దాన్ని ప్రదర్శించినప్పుడుండే ఆనందము వింటే ఏముంది? నామ రూప రహితుడే కాదు, సహితుడే అని చెప్పటానికి అవకాశం రూపం. అందరికీ అర్థమై ఆనందించటం కోసం రూపం. వున్నందువల్ల శక్తి పెరిగేది లేదు. తరిగేది లేదు.

భగవంతుడికి ప్రత్యమ్నాయం - దేవాలయాలు

సూదిమొపను కూడా స్థలంలేకుండా సర్వం నిండి యున్న వాడంటున్నప్పుడు - మళ్ళీ సూదులు అవసరం అయినాయి కదా! సర్వాన్ని నిండిన దాన్ని గుర్తించ లేరు కనుక రూపం, నామం అవసరమయింది.

అమ్మ ప్రకోపింప జేస్తుంది కాని. ప్రకోపించదు.

శ్రీ చక్రమంటే ప్రపంచం. భావంచేత రూపాన్ని ఏర్పరచు కోవాలి.

2) పంచ భూతాల సమ్మేళనమే గాయత్రి

కోరికలను తీర్చేటప్పుడు కామేశ్వరి యైనది, లాలించేటప్పుడు లలిత యైనది. ఆడుకొనేటప్పుడు బాల యైనది. అన్ని రూపాలు ఆ దేవతేగా.

రూపం పురుషుడు, లోని శక్తి ప్రకృతి. రెండూ ఒకదాని విడిచి మరొకటి లేదు. అద్దానికి రంగుపూస్తేనే కాని ముఖం కనపడుదు. సమిష్టి యొక్క వ్యష్టిత్వమే ప్రపంచం అనుకుంటున్నాను. **– జిల్లెలమూడి అమ్మ**

3) ప్రశ్న:– **అమ్మ దృష్టిలో మేమంతా ఎలా కనిపిస్తాము?**

అమ్మ:- అందరూ ఒకటిగా కన్పించరు. ఎవరికి వారు కన్పిస్తారు కాని అందరూ ఒక శక్తి స్వరూపమే అనిపిస్తుంది.

ఒకటిగా అనిపిస్తారు. వేరుగా కన్పిస్తారు (అంటే భావాద్వైత ముంటుంది. క్రియాద్వైతం వుండదు) ఏ శక్తి చేత నువ్వు ఏర్పడ్డావో- నీ జీవిత కాలంలో జరిగే పనులు ఆశక్తిచేత నిర్ణయింప బడ్డవే- నిర్ణయమంటే - నిర్ణయమంటే మార్పులు లేనిది - మార్చ బడనిది. అందువల్ల ఎవ్వరు చేసేపనులు వారికి నిర్ణయింప బడే వున్నాయి.



26

## జన్మలు

1) అద్వైత మత ప్రకారము ఈ జగత్తునకు భగవంతుడే ఉపాదాన కారణము. నిమిత్త కారణమును కావున భగవంతుడే యావద్ జగద్వ్యాపము నొందినారు. ఇది పరమ సత్యము. ఉపాదాన కారణము అనగా కార్యరూపమునొందిన కారణము. కార్యము కారణము యొక్క రూపాంతరమేకాని, వేరుకాదు. మనకు కనిపించు కార్యములన్నియు రూపాంతరము నందినట్టి కారణములే. ఈ జగత్తు మిధ్య. దీనికి ఉనికియే లేదు. ఇదంతయు మాయ. ఈ జగత్తు జన్మించుట, మరణించుట ఈ అ సంఖ్యాక జీవాత్మలు ఉత్పన్నమగుట, అంతరించుట, ఇవన్నియు స్వప్న సంఘటనలు. జీవాత్మ అనునదే లేదు. ఇక అనేక జీవాత్మలు ఎట్లుండగలవు?

కలది ఒకటే. అఖండ పరిపూర్ణ (జ్ఞానము) పదార్ధము. ఈ విభిన్న జీవరూపములలో ఆ ఒక్క భగవంతుడే ప్రతిఫలించుచున్నాడని భారతీయ పరమార్ధమైన అద్వైతము సుస్పష్టముగా చెప్పుచున్నది. దానికి మార్పులేదు. రాదు. దానిని అర్ధము చేసుకొనలేని జీవులు మాయకు లొంగిన వారలనే చెప్ప వచ్చును. స్వప్నము కూడా ఒక సత్య వస్తువుమీదనే ఆధారపడి యుండవలెను. ఆధార వస్తువులేక అధేయము నిలువ జాలదు. మూలాధార పదార్ధము నుండియే అన్నియు ఆవిర్భవించుచున్నవి. ఆ మూలాధారము ఈశ్వరుడే.

అదే పరిపూర్ణుడు అదే మనస్సుగా, జీవుడుగా, దేహముగా, ఆత్మగా యున్నది. నీవు స్వప్నమాత్రుడవే. యదార్ధ దృష్టికి లోక మంతయు సచ్చిదానంద స్వరూపమే. స్వప్న దృశ్యములు మనస్సునందే పుట్టి, మనసులోనే విలీనమగుచున్నవి కదా! ఇవి ఎట్లు పుట్టుచున్నవో యోచించుచున్నామా ! ఆ స్వప్నావస్థలో అది నిజమని తలంచి, రోదన, ఆహ్లాదము, భయము, విచారము, సంతోషము పొందుచున్నాము. తరువాత అవిఅన్నియు స్వప్నమని చింతించకున్నాము. అటులనే జగత్తు స్వప్నతుల్యము. అంతా ఈశ్వరుని నుండియే పుట్టి, తిరిగి ఈశ్వరునందే లయమగుచున్నవి. ఈ జన్మలు, పునర్జన్మలు, ఈ రాకపోకలు అన్నియు మాయా కల్పితములు. భ్రమలు, అసత్యములు. నీవే ఈశ్వరుడవు. **– భగవాన్ సత్యసాయి**

2) ప్రథమంలో స్పందనం కలిగినప్పుడే ఎవరి నడకలు వారికి ఏర్పడే వున్నాయి. ఆ స్పందనం అనేక రూపాలై కూర్చుంది. **– జిల్లెలమూడి అమ్మ**

3) మరపే మరణము. మరణమంటే పరిణామము. పరిణామానికి చరమదశ బ్రహ్మ స్వరూపము. తెలిసిన వాడికి జన్మలు లేవు. తెలియని వాడికి ఏది ఏమవుతుందో తెలియదు. ఒక జన్మకు ఏది కారణమో. అన్ని జన్మలకు అదే కారణము జన్మలకు కారణం అకారణం. తెలిసిన వాడికి - వాడికి కాదు కదా! ఎవరికి అనేక జన్మలు వున్నాయనిపించదు. ఏక జన్మేకదా! ఆత్మ నశించదు - అనుకున్నప్పుడు ఆత్మలోనిదే కదా ! జీవత్వం. ఆత్మకు లేని జన్మలు జీవత్వానికి ఎక్కడ నుండి వస్తాయి. మొట్ట మొదటి జన్మకు ఏది ఆస్కారమొ - ఈ సంస్కారాలు అన్నిటకీ అదే ఆస్కారము. జనన, మరణాల గురించి కృంగు, పొంగులు లేకపోవుటయే అమృతత్వము. **– జిల్లెలమూడి అమ్మ**

4) మీరు అనుకునే దానినిబట్టి అయినా ఈ జన్మకు గత జన్మకృతం కారణమైనప్పుడు - ఇప్పుడు ప్రయత్నంలేదుగా?

జన్మలు లేవు అనను. కాని రావటం, పోవటం అనేది నీ చేతులలో లేదని మాత్రం అంటాను. వున్నాయనుకో అప్పుడేనా వాడిస్తేనే **– జిల్లెలమూడి అమ్మ**

**5) మరణానంతరము జీవి ఏమవుతుంది?**

అమ్మ : సర్వ వ్యాప్తమైన ఆత్మలోనే - ఆ శక్తి ఎక్కడ వుంచితే అక్కడ సముద్రంలో నుండి వచ్చిన నీరు సముద్రంలోనికే వెళ్ళాలి కదా ! **- జిల్లెలమూడి అమ్మ**

**6) ప్రశ్న :- జన్మ పరం పరలమాట ఏమిటి?**

అమ్మ:- వీడు (మానవుడు) దేనికి కర్త కాడని - దేనికి స్వతంత్ర్యం లేదని చెప్పానుగా.

**జన్మ వాడిచ్చినదా, వీడు తెచ్చుకున్నదా?**

అమ్మ :- జన్మకు - కర్మకు - క్రియలకు వాడే కారణమైతే వీడు చేసిన కర్మలను బట్టి జన్మ రాదుగదా. పోనీ మీరన్నట్లు జన్మపరంపరలో అనుకున్నా ప్రధమ జన్మకు వీడుకర్తకాదుగ ! ఏ మంచి కర్మచేస్తే (తెలుసుకోవాలన్న) ఈ ఆలోచన వచ్చింది. **- జిల్లెలమూడి అమ్మ**

7) జన్మలులేవని నేనెందుకంటున్నాను అంటే - ఏ సత్యమైతే యున్నదో ఆ సత్యం తెలిసిన వాడికి జన్మలు లేవు. నాకు లేవు - మీకు లేవు అని వాడికనిపిస్తుంది. కొంచెం తెలిసీ, తెలియనప్పుడు ఆ భేదం కనిపిస్తుంది. ఎందుకంటే నాకు లేవు. మీకున్నాయని చెప్పంటం లేదు. మీకూ లేవు, నాకూలేవు అని అనిపిస్తున్నది. వున్న సత్యం అదని నాకనిపిస్తున్నది. నాకనిపించటం తప్పుకాదు. వాళ్ళది తప్పుకాదు. (జన్మలు వున్నాయనుకొనేవారికి) వాళ్ళు జన్మలు వున్నాయని అని అనటం వాళ్ళొచ్చిన రీతిలో, వారి స్థానంలో తప్పుకాదు. తప్పనగా ఏమిటి? ఆ స్థితి వ్యత్యాసమే. సకారణంగా.

**- జిల్లెలమూడి అమ్మ**

**8) పుట్టుక దేనికి కలుగుతున్నది?**

ఉపాధులకు కలుగుతున్నది. నీరు, గాలి, సంయోగము చెందినప్పుడు నీటిలో బుడగ కనిపించు చున్నది. ఆ బుడగకు నీరు ఉపాదాన కారణము. వాయువు నిమిత్త కారణము ఆరెంటికన్న భిన్నమైన స్థితి బుడగకు లేదు. అట్లాగే ప్రకృతి ఉపాదాన కారణం, పురుషుడు, నిమిత్త కారణంయై సోపాధిక జీవ జన్మకలుగుచున్నది. **- భాగవతం**

27

# సృష్టి

1) సృష్టి అంతా మూడింటితో కూడి యున్నది.

(వస్తు) రూపం లక్ష్మి

(ఉపయోగ) విజ్ఞానం సరస్వతి

(వస్తు) శక్తి పార్వతి (జిల్లెలమూడి అమ్మ)

2) రూపంలో గుణంలో భిన్నత్వమే సృష్టి

వస్తువు లేకుండా శక్తిని గుర్తించడానికి వీలులేదు. కాయలేని రసమెక్కడిది? కాయకు ఎంత శక్తో గింజకు అంత శక్తి.

సంకల్పం నిలువక పోవటం లోపమా? లేక పాపమా?

అమ్మ :- ఆ రెండూ కాదు. అది సృష్టికే యున్నది.

ప్రళయమంటే అంతా జలార్ణవం అవుతుందంటారు. కాదు ఒక మూలపోతున్నా - ఒక మూల వుంది. సృష్టి ఎప్పుడూ వున్నది – **జిల్లెలమూడి అమ్మ**

3) సృష్టి అంతయు ఇంద్రజాలకుని విద్యవలె మాయా కల్పిత మగుచున్నది. మాయ ఆత్మశక్తియే కదా ! శక్తి యొక్క విజృంభణము కదా. ఈ షణాది క్రియారూపమగు అభివ్యక్త క్రియాచరణ. మన యందలి శక్తి

అవుసరమైనప్పుడు క్రియారూపమున విజృంభించు చున్నది. అప్పుడు ఆ క్రియను మనము చేసితిమని చెప్పుచున్నాము. కాని మనయందలి శక్తి చేసినదని అంటున్నామా? అటులనే ఆత్మశక్తియగు మాయచే చేయబడిన ఈషణాది క్రియ ఆత్మయందు ఆరోపింపబడుచున్నది – **అయితరీయోపనిషత్తు**

4) బ్రహ్మదేవుని జననము - ఈ సృష్టిని సర్వ పదార్థ సాక్షాత్కార వంతుడు సర్వజగ్ న్నియామకుడు, సర్వాంతర్యామి, నిర్వికారుడు అయిన భగవానుడు సంకల్పించాడు. ఆ సంకల్పానికి అతని శక్తి చలించి ఈక్షణరూపాన్ని తాల్చింది. ఈక్షణ రూప ప్రేరణ మాత్రాన నేను జన్మించాను. – **బ్రహ్మదేవుడు**

భగవంతుడు ఎప్పుడు సృష్టిని సంకల్పించాడో, అప్పుడే సృష్టి మొత్తం భావాత్మకమైన పరమ సంస్కారరూపాన్ని వహించింది. ఆరూపాన్ని నేను స్థూలం కావించాను. ఇదే నా సృష్టి కర్తృత్వం.

సృష్టి విధానం భగవంతుని చేతనే రచింప బడింది. సృష్టి సామాగ్రి నంతటిని భగవంతుడే కూర్చాడు. కారణమైన పరమేశ్వరుడే కార్యమైన సృష్టికి అధిష్టానం. **– భాగవతం**

5) సృష్టి, స్థితి, లయ కర్తలు

ఆ భగవంతుని ఆజ్ఞ ప్రకారం నేను ఈ ప్రపంచాన్ని సృజించాను. ఆ భగవానుడు విష్ణురూపం ధరించి దీనిని పరిపాలిస్తాడు. హరుని రూపం దాల్చిఆయన దీనిని లయింపచేస్తాడు. హరి, హర బ్రహ్మలనే మేము ముగ్గురము ఆయన విలాసమూర్తులమేకాని స్వతంత్రులముకాము. **– భాగవతం**

6) సృష్టి రహస్యార్థం (భగవానుడు బ్రహ్మకు చేసిన భాగవత ఉపదేశం)
ఈ విశ్వమంతా నేనే దృశ్యమైనంత మాత్రాన ఈ విశ్వం నాకంటె వేరుకాదు. నేను నామాయను అధిష్టించి సృష్టిని నిర్వహిస్తాను. మాయ అన్నది నాకంటే అన్యతరమైన ప్రత్యేక వస్తువని భ్రాంతి చెందకూడదు. అది నా శక్తి మాత్రమే. శక్తి, శక్తిమంతుడు కలసి, మెలసి ఏకాకృతిగా వుండటమే దర్శనీయం. శక్తి

మంతుని సంకల్ప ప్రకారము అతని శక్తి అయిన మాయ వివిధ రూప నామ పదార్థాలను రచిస్తుంది. ఆ పదార్థాలు వేర్వేరని భావింపకూడదు. అటువంటి భావం వున్నంతకాలం మనో దృష్టులు ఆపదార్థములందే నిలిచి వాటికి మూలమైన వస్తువును చూడలేవు. వాస్తవ వస్తువును చూసినప్పుడు దాని శక్తిచే రచింపబడిన పదార్థాలు ఆ వస్తువుకంటే భిన్నంగా నీకు కనిపించవు. పరమాత్మ స్వరూపుడనైన నేను సర్వకాల సర్వావస్థలలోను సర్వ వ్యాపకుడనై వున్నాను. కార్య కారణాలకు అవినాభావత్వం సహజమైనా నేను కారణావస్థలో కార్యానికంటే విశిష్టుడనై వుంటాను. అప్పటి నా వునికిని.జాగ్రత్ స్వప్న సుఘప్తులలో సాక్షీమాత్రంగాను, సమాధ్యాదులైన ఉత్తమా వస్థలో కేవలంగానూ గ్రహింపగలవు. – భాగవతం



## 28

## అనుగ్రహం

1) చూస్తేకనపడను, కనపడితే చూస్తారు. (అంటే అమ్మ అనుగ్రహిస్తేనే కాని ఆమెలోని ఏ కొలది శక్తినో గాని మనం గ్రహించలేము) స్థితులు మనం పొందటం కాదు దైవం ఇవ్వడమే . మానవులకే కాదు జీవ జంతువుల అన్నిటికి.

ఆయా సమయాల్లో ఆయా పనులు చేయించడమే కరుణ (అమ్మ రూపం పరిమితం. శక్తి అనంతం. తెలియనిది తెలియ చెప్పటానికే రాక.

**– జిల్లెలమూడి అమ్మ**

2) భగవత్ కృప నిర్హేతుక మనియు, జప తపములనెడి ఖరీదునిచ్చికొనుటకు భగవంతుడు కూరగాయలు వంటివాడు కాడని, భగవానుని, నైజము పసిబాలుని వంటిది. యావజ్జీవము ఒకడు అఖండ తపస్సు చేయును. కాని భగవంతుని కనజాలక పోవును. చెప్పదగిన ప్రయత్న మేమియు లేకనే మరియొకడు వాని సాక్షాత్కారము పొందును. (వేమన). కారణము భగవదనుగ్రహమే సర్వము ఈశ్వర సంకల్పముననుసరించియే జరుగును. అయినను మానవుడు కృషి చేయ వలయును. ఏలయన మానవ కార్యముల మూలముననే ఈశ్వరుడు తన సంకల్పమును ప్రకాశింప జేయును. తుచ్ఛ విషయముల కోసము ప్రాకులాడుట మన స్వభావము. కాని భగవదను

గ్రహము దానికి ఉత్తమగతిని కల్పించి ఉన్నతాశయముల దెసమరల్ప జాలును. అనుగ్రహమునకు ఏదైనా హేతువనునది వున్నచో అయ్యది నిర్మల భక్తి. – శారదా దేవి

3) ఆపదలను, కష్టములను కలుగ రాదని తలచుట పిచ్చితనము. అవి కలిగి తీరును. కాని భక్తుని విషయమున వంతెన క్రింద నుండి నీటివలె అనాయాసముగ దాటి పోవును. సాదకుడు తాను గ్రహింపకున్నను భగవదను గ్రహము అనుడు లేక గురువనుగ్రహమనుడు వానిపై ప్రసరించుచునే యుండును. తన్మూలమున అతడు అభివృద్ధి నొందుచునే యుండును.

ప్రశ్న:– **అమ్మ! నేను మీ సన్నిధికి తరచుగా వచ్చు చున్నాను కదా! కాని నేనేమియు సాధింప జాలనైతిని. మునుపే స్థితిలో యున్నానో ఇప్పుడు అదే స్థితిలో వున్నట్లు తోచున్నది. కారణమేమి?**

దేవి:– నీవు మంచం మీద పడుకొని నిద్రపోవు చుండగ, ఎవరో నిన్ను మంచంతో కూడా మరియొక చోటికి మార్చి నారను కొనుము. నీవు లేచిన వెంతనే క్రొత్త చోటికి వచ్చినట్లు తెలుసుకొలేవు. నిద్రమత్తు పూర్తిగా పోయిన తరువాతనే ఆ సంగతి తెలుసుకో గలవు.

4) చిక్కులలో, తీరని సందేహములలో, తగులు కొనునప్పుడు, వ్యాకులపడుటకు మారుగా దారిని చూపమని కన్నుల నీరు పెట్టుకొని భగవానుని ప్రార్థింప వలయును. **– శారదాదేవి**

5) స్వామీ! గత్యంతర మేమిటి మానవులకు? నీ పాదకమలములే గతి. వేరొకటి కాదు. ఇంద్రియ వశుడై స్వాతంత్ర్యం కోల్పోయిన వాడు నిన్ను శరణిల్లడానికి మాత్రం శక్తివంతుడు ఎలా కాగలుగుతాడు ?

ఈశ్వరా! ఆశక్తి కూడా నీ అనుగ్రహం వలననే కలగాలి. సత్‌పురుషసేవ వలన అటువంటి శక్తి కలుగుతుందని, నా అనుగ్రహం ఎందుకని అంటావా? ఎప్పుడు పురుషునికి సంసార మోక్ష కాలాన్ని నీవు సంకల్పిస్తావో అప్పుడే

అంతర్యామివైన నీవు మా బుద్ధిని సాధు సేవకు మళ్ళిస్తావు. అప్పుడు మేము సాధు సేవాపరులమై తన్మూలాన నీ పాద పద్మాలను ఆశ్రయిస్తాము. కాబట్టి అదీ నీ అనుగ్రహ ఫలమే. దేవా! నీ కృప కలుగని నాడు సాధు సేవా భాగ్యం కలుగదు. కాగా ఒక్క సాధు సేవా భాగ్యం కలిగినంత మాత్రాన ఫలం లేదు. బుద్ధి నీ పరం కావాలి. అది నీ కృపవల్లగాక వేరొక తీరున కలుగదు. ఇవన్నీ కలిగిన ముక్తి అన్నది కేవలం నీ కృపా విశేషం మాత్రమే. కాబట్టి అన్ని శుభాలకు నీ అనుగ్రహమే మూలం. **– భాగవతం**



## 29
## ఉపదేశం

1) సందేహ నివృత్తి చేసేదే సందేశం.

గుర్తు చెప్పిన వాడే గురువు. ఉపదేశమంటే దైవ సన్నిధిని చేర్చటం. కాలువ నిండుగా ప్రవహిస్తున్నా- దాహమైతే దిగటానికి రేవు కావాలి కదా!

– జిల్లెలమూడి అమ్మ

2) ఉపదేశమంటే గురుని శక్తి మంత్ర ద్వారమున శిష్యుని యందు ప్రవేశించును. కావుననే ఉపదేశ సమయమున శిష్యుని పాపములను గైకొని తత్ ఫలముగ గురువు విశేషమైన శరీర బాధల ననుభ వించును - వ్యాధుల బాల్పడును. గురుత్వము వహించుట కష్టములకెల్ల కష్టము ఏమన శిష్యుని పాప బాధ్యతను గురువు భరింప వలయును. బాధ పడవలయును.

ఎవరి బాధ్యతను నాపై పెట్టుకొని యున్నానో వారందరునూ బంధ విముక్తులు కానిదే ఈ శరీరము మరణానంతరము అయినను నాకు ముక్తిగలుగుననుకొను చున్నావా?

నేను వారిచెంత సదా వుండవలయును. వారి విషయమున సమస్తమైన మంచి చెడ్డలకును నేను ఉత్తర వాదిని, మంత్రోపదేశము చేయుటనిన మాటలా? ఎంత బ్రహ్మాండమైన బాధ్యతను మేము వహింప వలయున వారి కొరకు ఎంత తాపత్రయపడవలయును. – శారదాదేవి

3) ఉద్ధవా! అర్జునునికి కర్మయోగమే ప్రధానము చేసి చెప్పాను. నీకు భక్తి యోగాన్ని ప్రధానం చేసి ఉపదేశించాను. కారణ మేమంటావా? గురువు శిష్యుని మనస్తత్వాన్ని బట్టి ఉపదేశించాలి. వారికి బుద్ధి బేధాన్ని కలిగింప కూడదు. అర్జునునిలో సత్వగుణం కంటే రజోగుణం ప్రధానంగా వుండేది. అందువల్ల పార్థుడు అప్పుడప్పుడు స్వాతంత్రించి నాతో వాద ప్రతి వాదాలు చేయటమేకాక నా ఎత్తులన్నిటినీ లౌకిక దృష్టితో నిరశించి "నీ వెన్నయినా చెప్పు నేనెంతమాత్రము యుద్ధానికిరాను" అని తిరుగు బాటు చూపి శరపాశాలను విడిచి పెట్టాడు. ఈ లక్షణాలన్ని రజోగుణ ప్రవృత్తిని చూపుతాయి. రజసుమించి, సత్వంవృద్ధి పొందితేకాని తత్వ రహస్యం బుద్ధిస్తమై అనుష్ఠానానికి రాదు. నిష్కామకర్మ వలన కాని రజసు నశింపదు. అందువల్ల అతనికి జ్ఞానాన్ని పరమావధిగా చూపి, జ్ఞాన సిద్ధికి భక్తి సాధనమవుతుందని చెప్పి భక్తి కుదురుకొనటానికి చిత్తశుద్ధి కలగాలని బొదించి చిత్తశుద్ధికి నిష్కామ కర్మమే పరమోపాయమని వివరించి కర్మయోగాన్ని సరహస్యంగా ఉపదేశించాను. ఉద్ధవా! నీ తత్వం సత్వ ప్రధాన మైనది. అందువల్లన నాకు మొట్ట మొదటనే దాసోహం అన్నావు. నా ఉపదేశ వాక్యాలను కిమ్మనక తలదాల్చావు. ఆ కారణాన నీ తత్వానికి అనురూప మైన భక్తి మార్గాన్ని నీకు భోదించాను అదే ముక్తికి పరమ సాధనం. **– భాగవతం**

4) భాగవత పురాణ సందేశం:-

(1) భగవంతుడు సర్వేంద్రియ ప్రేరకుడు, సర్వజీవ నియామకుడు అని

(2) భగవన్నామ సంకీర్తన సర్వజనులకు నియత ధర్మమని

(3) భగవంతుడు నిర్గుణుడు కాబట్టి అతని తత్వం సమగ్రంగా తెలియాలంటే అపరోక్షజ్ఞానం ఒక్కటే సాధనమని.

(4) అట్టి జ్ఞానానికి భక్తి యోగం పరమోపాయం అని

(5) భక్తి యోగానికే వైరాగ్యం అవసరమని. **భాగవత పురణసందేశం**

## 30

## బ్రహ్మ చర్యము

1) బ్రహ్మచర్యమంటే కేవలం పెండ్లి చేసుకోక పోవడం కాదు. లింగ భేదము, రూప భేదము, స్పర్శభేదము, లేకుండ వుండటమే బ్రహ్మచర్మము. పెండ్లి కాకముందు మేము బ్రహ్మచారులమంటే విశేషమేముంది? పెండ్లికాక పోయినంత మాత్రాన వాడికి ఆ భావం కలుగదని మాత్రమేముంది? మరి అప్పుడు బ్రహ్మచర్యమేముంది? సంకల్పం కలిగి అవకాశాలు కలిగినప్పుడు వెనక్కు రావాలి - అదీ కలగని రోజు.

**పెళ్ళి ఎందుకు?**

కోరికలు కలిగినప్పుడు దారితప్పకుండా వుండటానికి. ఎవరి మనస్సు వారు అదుపులో వుంచు కోవటానికి శరీరానికి అంటుకోవటమే ప్రధానమా? మనస్సుకు అంటుకోవటం కాదా! మనస్సు క్షాళనం కానిది, మనస్సులో బ్రహ్మచర్యస్థితి ఏర్పడనిది- శరీరాన్ని జాగ్రత్త పెట్టినంత మాత్రాన బ్రహ్మచర్యమవుతుందా? - **జిల్లెలమూడి అమ్మ**



# 31

## మంత్రము

1) ఏది చేసినా ఒకటే అన్ని మంత్రాలు ఒకటే. ఎందులోనైనా ఒకే శక్తియున్నది. పేర్లు అక్షరాలు మార్పుతప్ప. చరమ దశలో ప్రతి మంత్రానికి ఒకే అర్థం వస్తుంది. ప్రతి వస్తువును అదే రూపంగ చూడటమే ఏకాగ్రత.

అర్థం తెలిసి అశుద్ధానికి పూజచేసినా వాడికే చెందుతుంది. (పేడ అశుద్ధం కాదు! పేడతో గౌరిని చేసి పూజ చేస్తున్నాం కదా!)

డబ్బాలో పసుపుకు నమస్కారం పెడతామా! నీళ్ళతో తడిపి ముద్దగా చేస్తే దానిని గౌరి అని పేరు. పెట్టి నమస్కారం చేస్తాం. గోడకురాచి బొట్టు పెట్టి పోలేరమ్మ అంటున్నాం. ఉపయోగించే వస్తువు ఒకటే - ఇక్కడా, అక్కడా కాని సర్వత్రా చూడ లేము కనుక పరిమితిలో చూడటం ఇవన్నిని. సర్వత్రా వున్న దైవాన్ని గుర్తించలేనప్పుడు గుడి ఆధారమైనట్లు. **- జిల్లెలమూడి అమ్మ**

ప్రశ్న:- **సాధనకు మంత్రం అవసరమా? ఎంత వరకు ఉపయోగ పడుతుంది?**

అమ్మ:- అసలు మంత్రం అంటే ఏమిటి? ఓపిక లేని వాడు కర్రపట్టుకున్నట్లు. మనస్సుతో మనస్సును గుర్తించాలి కనుక మనుస్సును మాటల్లో పెట్టి మాటను మంత్రం చేసి మనస్సు మంత్రమైంది. మంత్రాన్ని

తాను చేస్తున్నాను అనుకుంటూ మనస్సును గుర్తించింది. ఓపిక లేదనుకో - ఓపికలేని వాడికి కర్రసాయం చేసినట్లు. మళ్ళీ ఆ కర్రను పట్టు కోవలసింది వాడే.

మంత్రం అంటే ఏమిటి? - మనస్సే కదా. మననం చేత మంత్రం అవుతుంది. **- జిల్లెలమూడి అమ్మ**

2) తృప్తిని, హాయిని, శాంతిని, ఇచ్చి సందేహ నివృత్తిచేయగలిగిందే మంత్రం మన మనస్సే గురువు. గుర్తె (గుర్తించిన జ్ఞానమే) గురువు. మీరు ఏ గురువుల దగ్గరకు వెళ్ళ నక్కర లేదు. మీరు సాధనచేయ యత్నించినా చేయనివ్వకుండ ఏదో బలవత్తర శక్తి అడ్డు వస్తుంది కదా! ఆ అడ్డు పడే శక్తే దైవం. అది ఎట్లా నడిపిస్తే అట్లా నడుస్తున్నాం -తరుణం వస్తే ఆశక్తి మీ సాధనను నడిపిస్తుంది. **- జిల్లెలమూడి అమ్మ**

3) నైతిక, ఆధ్యాత్మిక ధర్మములను అనుసరించి చిత్త శుద్ధి కలిగిన మహనీయులు జ్ఞాన చక్షువుల ద్వారా పరమేశ్వరుని చూడగలుగు తున్నారు. అల్పక్రిములను అణువస్తువులను చూడజాలని మానవ నేత్రములు, యంత్రసహాయము ఆశించగా సర్వవ్యాపియగు పరాత్పరుని చూడగోరుటకు మంత్ర సహాయము ఆశించకయే ఎట్లు చూడగలరు? జ్ఞాననేత్రములు పొందుట సులభమైనది కాదు. దానికి ప్రత్యేకమైన ఏకాగ్రత అవసరము. ఏకాగ్రతను అలవరచుకొనుటకు చిత్తశుద్ధి, నైతిక ఆధ్యాత్మిక వివేకము ముఖ్యము. సామాన్య మానవులకు ఇది అంత సులభము కాదు.

**- భగవాన్ సత్యసాయి**

4) ఆత్మ వికాసము క్రమ సాధననుసరించి యుండును. ఒక జన్మలో ఒకడు జప తప సాధనలు చేసి యుండవచ్చును. ఉత్తర జన్మమున వాని ముముక్షత్వము తీవ్రమగును మలి జన్మమున మరింత తీవ్రమగును. మనో నిగ్రహము, నైర్మల్యము అమూల్యమైన సంపదలు. జప మూలముననే సిద్ధి

కలుగును. మంత్రోపదేశము మనస్సునేకాక శరీరమును సైతము పవిత్ర మొనర్చును. – శారదాదేవి

**ప్రశ్న :– మనో నిగ్రహము సాధ్యము కాకున్నది ఏమిచేయవలెను?**

దేవి :- మేఘములను వాయువు పాలద్రోలునట్లు చిత్త చాంచల్యమును, వ్యామోహమును, భగవన్నామము పారద్రోలును. కనుక భగవన్నామము సదా జపించినచో సకాలమున నీ సంసార బంధమును విచ్ఛిన్నము చేయును.

– శారదాదేవి



# 32
## పాతివ్రత్యము

1) అన్ని ఆభరణాలు వేసుకోవడానికి అర్హతనిచ్చే ఆభరణం మాంగల్యం - అది ఈశ్వరుని చేత కట్టబడింది. తలంబ్రాలు అంటే తలంపులు. ఒకరికి తోచిన తలంపులు ఒకరికి చెప్పుకోమని సూచన

ఒక పెన్నిధి అండన చేరడం పెండ్లి.

ఆ అండనుపొందే పరిణామమే పరిణయము.

సర్వాన్నీ అనుభవిస్తూ, సర్వాన్నీ విడిచిపెట్టేదే వివాహం.

కళంక రహితమైన మనస్సును కళంక రహితంగా మరొక వ్యక్తికి అర్పణ చేయటమే కళ్యాణం.

భావం తెలుసుకొని ప్రవర్తించేదే భార్య

బాధ్యత తీసుకొని భరించేవాడే భర్త. ఆయన ఏదారినపోతే నువ్వు ఆదారినే పోవటమే నువ్వు చేయ్యవలసింది.

మంగళసూత్ర రూపేణ భర్తపాదాలు భార్యకంఠాన ఎట్లా బంధింపబడియుంటాయొ, యజ్ఞోపవీత రూపేణ భార్య భర్తతోటే సదా యుంటుంది. **– జిల్లెలమూడి అమ్మ**



33

## ధర్మం - ప్రేమ

1) రుక్మిణి - కృష్ణుడు నా భర్త అంటుంది.

సత్యభామ - నేను కృష్ణుడు భార్యను అనుకుంటుంది (రాకేంచేస్తాడు అని)

రాధ - నువ్వుఎవరైతే నాకేమి. నువ్వేకావాలి నిన్ను వదలి వుండలేను అనుకుంటుంది.

రుక్మిణి దగ్గర కృష్ణుడు లేకపోవచ్చు. కృష్ణుడు దగ్గర రుక్మిణి వుంటుంది.

సత్యభామ దగ్గర కృష్ణుడు వుండొచ్చు. కాని సత్యభామలో కృష్ణుడులేడు.

రాధ ఉచ్ఛ్వాస, నిశ్వాసాలే కృష్ణుడు.

కారణ జన్మమైన ప్రేమ పరిమితమయింది. ఇదికేవలం ప్రేమించే వ్యక్తి, ప్రేమింపబడే వ్యక్తుల వరకే పరిమితమైంది.

ప్రేమ యొక్క రూపాంతరమే కోపము ప్రేమకంటే భక్తి గొప్పది.

**- జిల్లెలమూడి అమ్మ**



# 34

## సన్యాసం

1) వివాహం చేసుకొని గృహస్థుగా ఆధ్యాత్మిక సాధన చేయటం కోటలో వుండి యుద్ధం చేయటం. సన్యసించడం కోట విడిచి యుద్ధానికి వెళ్ళటం. మంచంమీద వద్దు - చాపమీదే పడుకుంటాను అనటం కోరికే. తెల్లగుడ్డవద్దు కాషాయ గుడ్డ కావాలనటం కోరికే. ఆ కోరికలేనీ స్థితిని సంపాదించుకోవటానికి చేసే ప్రయత్నం సన్యాసం.

సన్యాసి కావలెగాని పుచ్చుకొనటం కాదు. వైరాగ్యమంటే వేపాకు తిని వుండటమే కాదు. ఏది దొరికితే అది తృప్తిగా స్వీకరించటమే. లింగ భేదం రూప భేదం స్పర్శ భేదం లేనివాడు సన్యాసి.

జింహ్వాను జయంచటమంటే ఏది అందితే అది తినడం : వేపాకు తింటాను అంటే అదీ కోరికేగా. **– జిల్లెలమూడి అమ్మ**



35

## నేనెవరు

1) కేక వేసినది, విన్నది నేనే. చూసేది కండ్లు అయినా గుర్తించే గుర్తు నేనే. నేనెవరు అన్న ప్రశ్నకు సమాధానం దండలోని దారమే. పూసలు ప్రక్కకులాగి నప్పుడు నేననే దారం కనిపిస్తుంది.

తన్నుతాను గుర్తించిన వాడు సర్వాన్నీ గుర్తిస్తాడు. అనాత్మ అని బయలు దేరితేగా! ఆత్మ అని తెలిసేది. ఏది అవును. ఏదికాదు అని తేల్చుకున్నది వివేకం. ఈ గోడ మధ్యనున్న సంధు నిర్వికారము. ఇది వుండటానికి ఆధారం ఆకారమేగా, ఈ రెండూ గుర్తించిన స్థితి వికారం లేని ఆకారం. అన్ని రూపాలు ఒకటేనని స్థాయి రావటమే దైవత్వం. కర్త, కర్మ, క్రియ ఒక్కటే. **- జిల్లెలమూడి అమ్మ**

2) రమణ భగవాన్ చెప్పింది ఎట్లా అన్వయమవుతుంది అంటే లోపల నున్నది నేను. అని తెలుసుకోవాలంటే - బయట వున్నది నేను అని తెలుసుకోవద్దు! నేను అన్నది ఆధారం కాదు.

నేను అన్నది ఒక గుర్తే. గుర్తుతో గుర్తించి గుర్తు నశించాలి అని చెప్పాను కాదా! "వున్నదే నేను. అంతటా చూస్తున్నది నేను. నేనును తెలుసుకొన్నది

నేను. ఉన్నది నేను. ఆ అనుకున్నది నేను. అయింది నేను - నేను నీవయిన నేను.

అట్లాగే ఆయన నేనైన నేను అనుకోవ డానికి కూడా - అది నేను, ఇది నేను, అలాపోయి పోయి అన్నీ నేనే అనుకున్నాడు - అప్పుడు నేనైన నేను. ఇదంతా నేను దృఢ పడిన తరువాత సందేహంరాదు. అన్నారాయన. ఆ స్థితికి వెళ్ళాను అన్నారు. అక్కడ నున్నాను అన్నారు. వున్నదే నేను అని దృఢమై పోయింది. **– జిల్లెలమూడి అమ్మ**



## 36

## యోగము

**ప్రశ్న:– ఏకాగ్రత కలగటానికి కనుబొమ్మల మధ్య దృష్టి నిలిపితే ఏర్పడు తుందంటారు కదా! అది సాధ్యమవుతుందా! అమ్మా!?**

అమ్మ:- సర్వత్రావున్నదాని మీద దృష్టి నిలుపలేము కనుక ఒక గుర్తులో చెప్పటం. ఈ ఫోటోలు, ఈ గుళ్ళు, మంత్రాలు - ఇవన్ని ఎందుకు అవసరమో ఇది అందుకే. లక్ష్యానికి హేతువయినది. అంతేకాని - ఆ కనుబొమ్మలు మధ్యనే శక్తి వున్నదని కాదుగా అదొక గుర్తు.

అవయవాల చేత మనస్సు కట్టు బడేది ప్రాణాయామం. మనస్సు చేత అవయవాలు కట్టు బడేది భక్తి.

నన్ను నీవు కలుపుకోమని పైకి వెళ్ళిందే - బ్రహ్మ స్వరూపం - ఉచ్ఛ్వాసం.

క్రిందికి దిగిందే - మానవరూపం - నిశ్వాసం

చెప్పేది, చేసేది, చూసేది- సాంఖ్య, తారక, అమనస్కములు.

**- జిల్లెలమూడి అమ్మ**



37

## సంకల్ప రాహిత్యం

1) భగవత్ సంకల్పం కాదు. సంకల్పమే భగవంతుడు (అంటే సంకల్పము, భగవంతుడు వేరు వేరు కాదు)

చేసేవాడి సంకల్పం చేత ఏర్పడ్డ ఈ సృష్టి సంకల్ప రహిత మెట్లా అవుతుంది?

సృష్టికర్తే సంకల్ప రహితుడు కాడు. మన సంకల్పమెట్లా పోతుంది.

ఈ సంకల్పం మనది కాదను కోవటమే సంకల్ప రాహిత్యం.

సంసార బాధ్యతే ఆధ్యాత్మిక సాధన. ఆధ్యాత్మిక సాధన అంటే అదేదో వేరే కాదు.

నువ్వు చేసే ప్రతీపని, భగవత్ సేవయని, భగవదాజ్ఞాను సారమే అని అనుకో గలిగితే ఈ సంసారం ప్రతి బంధకం కానేరదు.

నోట్లో పటిక బెల్లం వేసుకున్నా తీపి అంటని స్థితి (ధ్యాసలేనప్పుడు)

సంసారంలో వుండి జయించటం. గృహస్థుడిగా వుండి - అన్నీ చేసి - ఏమి అంటకుండా వున్నవాడు. **- జిల్లెలమూడి అమ్మ**



38

## వేదాంతము

1) వేదాంతమంటే చెప్పే వాడికి, వినే వాడికి అర్థంకాదు. నాకు వ్యక్త పరచే భాష లేదు మీకు అనుభవించే శక్తి లేదు.
అనుభవం శాస్త్రాన్నిస్తుంది. కాని శాస్త్రం అనుభవాన్నివ్వదు.

వ్యహారము వినే వాడికి తెలిసినా, తెలియక పోయినా చెప్పేవాడికి తెలుసు కానీ వేదాంతం చెప్పేవాడికి తెలియదు. వినే వాడికి తెలియదు.

చెట్టు, విత్తనం ఒకటే. అదే చెట్టు, కొమ్మ, ఆకు, కాయ, పువ్వు, పండు - ఇన్ని అయినట్టు ఒకే శక్తి. రూపాలు వేరని నాకని పిస్తుంది మొదట " నేతి నేతి" తర్వాత అంతా అగును.

ఆధ్యాత్మికానికి లౌకికానికి తేడాలేదు. మీరు నేననే శరీరం కాదంటున్నారు. కాని నేను అన్నీ (శరీరం, మనస్సు, జీవాత్మ) నేనే అంటాను.

చెప్పే వాడిలో వాడే. వినే వాడిలో వాడే. తేడా ఎందుకు.

మినపప్పంత ఉప్పు పోస్తే రుచిరాదు. అందుకే వ్యత్యాసం.

నేను నేనైన నేను అంటే మొదట ఏది వుందో చివరకు అదే.

ఆత్మే స్వభావం, ఆత్మే స్వరూపం.

వ్రేళ్ళు రూపము, వ్రేళ్ళ మధ్యది అమ్మే. అందరూ అవతారాలే. తలో పనికి వచ్చాము.

సర్వకాల సర్వావస్థలయందు సమాన స్థితియే సమాధి. సమత్వమే సమాధి. తృప్తి అంటే ఇంత కంటె లేదనే స్థితి. పరిపూర్ణత్వం అంటే తెలియనిది లేక పోయినా, తెలిసింది లేకపోయినా ఒకటేస్థితి. **- జిల్లేళ్ల మూడి అమ్మ**

39

## శాస్త్రము

1) అహం, ఆకారం దాల్చి అహంకారమైంది. ధ్యానం అంటే ధ్యాస. కళ్ళు మూసుకొని కూర్చోవటమే కాదు, ఒకళ్ళు నామంలో, ఒకళ్ళు జపంలో ఒకళ్ళు సంభాషణలో ఒకళ్ళు తత్వంలో ఆనందం పొందేవాళ్ళున్నారు. అన్నీ ధ్యాసలే. అన్నీధ్యానాలే. సాకారాన్నా గుర్తించటానికి నిరాకారం, నిరాకారాన్ని గుర్తించటానికి సాకారం ఆధారం. భూత, భవిష్యత్, వర్తమానాలు అన్ని ఏక కాలంలో చూడటమే తురీయము. తపస్వి అంటే దేనికైనా సరే నిరంతరం తపించేవాడు. **– జిల్లెలమూడి అమ్మ**

2) యుగ యుగములకు శాస్త్రములు వేరు వేరు సాధనలను ఏర్పాటు చేసి యన్నాయి. కృత యుగములో తపస్సు, త్రేతాయుగములో జ్ఞానము, ద్వాపర యుగంలో యజ్ఞము. కలియుగంలో దానము చేయవలయునని శాస్త్రములు చెప్పు చున్నవి. దానములన్నిటిలో అన్నదానమే శ్రేష్ఠము. ఎవరైతే బీదలకు, ఆకలితోనున్న వారికి భోజనం పెట్టెదరో వారే గొప్పదాతలు. ఆహారమే పరబ్రహ్మ స్వరూపము. అన్నదానము లేకున్నచో ఇతర దానములు ప్రకాశించవు. **– షిరిడి సాయి బాబా**



40

## తరుణము

1) తప్పించు కుందామన్న తప్పనిది, చేద్దామన్నా చేయనీయనిది. వీటినన్నింటినీ నడిపించేది -శక్తి.

ఆ గీతలో ఏమన్నాడో కాని మన గీత అర్థం కాని వ్వటం లేదు.

అనుభవించే యోగ్యత వున్నప్పుడు అది బాధగాని, సుఖంగాని తెలుసుకోకుండా తన చేతులతో తాను చేసు కోవటం జరుగుతుంది.

నమస్కారం నువ్వు చెయ్యటం కాదు, చేయించు కోవటమే

కాలమే కాళీ అయింది. కాలమే కర్త. అన్నీ చేయిస్తుంది. కాలం అంటే అర్థం కానిది. **- జిల్లెలమూడి అమ్మ**



41

## గురువు

1) ఆత్మ సాక్షాత్కారానికి గురువు ఉపదేశం అవసరమా?

అమ్మ:- మనస్సు గురువే కదా! పరిస్థితులే గురువూ. బంధువూ. గుర్తు చెప్పేవాడే గురువు గుర్తు చేసేవాడు దైవం.

గురువు, భగవంతుడు రెండూ ఒకరే. భేదము లేదు. - **జిల్లెలమూడి అమ్మ**

2) పంచేంద్రియముల కంటే ముందే మనస్సు, బుద్ధి, విషయానందం అనుభవించును. కనుక మొదలే భగవంతుని స్మరించ వలెను. ఇట్లు చేసినచో ఇది కూడా ఒక విధముగ. భగవంతుని కర్పితమగును.

కనుక ఆ విషయములను మొదట గురుని లేక భగవంతునికర్పించినచో వానియందభిమానము సహజముగా అదృశ్యమై పోవును. ఇవ్విధముగ కామము,క్రోధము, లోభము మొదలగు వాని గూర్చిన వృత్తులన్నియు (ఆలోచనలను) మొట్ట మొదట గురునికి అర్పించ వలెను. ఈ అభ్యాసము ఆచరించినచో దేవుడు వృత్తులన్నియు (ఆలోచనలను) నిర్మూలన మగుటకు సహాయ పడును. క్షుప్తముగ చెప్పున దేమన మనము గురుని స్మరించనిదే ఏవస్తువును పంచేంద్రియములతో అనుభవింపరాదు. దేవుని వలే యోగేశ్వరులు కూడా, భక్తులపై ఆధారపడెదరు. ఏభక్తుడు హృదయ పూర్వకముగను పూజించి, శరణు వేడెదరో వానికే భగవంతుడు తోడ్పడును. **షిరిడి సాయి బాబా**

## 42
## బాధ

1) అక్కర లేనిది అనుభవిస్తున్నా బాధే. అవసర మైనది. అనుభవించక పోయినా బాధే. బాధకు కారణం భేదమే.

నేను చెప్పింది నీకు సరిపోదు. నీవు చెప్పింది ఇంకొకరికి సరిపోదు - అదే బాధ.

బాధ్యతే బాధ. బాధలేని బాధ్యతలు అందరికీ లభ్యపడవు. దానికి, దీనికి తేడా ఏమిటి?

అమ్మ:- నేను చేస్తున్నాను. నాది, నాకు - అనేది బాధగల బాధ్యత. అంత కంటే రెట్టింపు పనిచేసినా "నేనే చేస్తున్నాను". అనేది లేకుండ మనం నిమిత్తం అనుకుండేది బాధలేని బాధ్యత. **- జిల్లెలమూడి అమ్మ**

2) ఎక్కడవున్న, ఏమి చేసిన, ఎవరిదయా వీక్షణవున్న కష్టాలు మాత్రం తప్పవు. ఎందుకంటే జీవితంలో అవి ఒక భాగమే. కనుకనే ప్రాణమున్నంత వరకు అవి తప్పవు. కాకపోతే కాలగతిలో రూపం. మారవచ్చును. కాని కష్టం తప్పదు. ఒక కష్టం తొలగితే దాని స్థానేమరొక కష్టం రావచ్చును. ఒక సమస్య పరిష్కారం అయితే మరో సమస్య తలెత్తుతుంది. ఒక ప్రశ్నకు సమాధానం దొరికితే మరోప్రశ్న ఎదురవుతుంది. ఇక ఈ జపాలు, ఈ ధ్యానాలు, ఈ

నామస్మరణలు వలన కష్టాలు అనుభవిస్తున్నా - బాధనిపించదు. కష్టాలు భరించే శక్తి వస్తుంది అంతే.

**– జిల్లెలమూడి అమ్మ**

3) ప్రశ్న:- నేను వద్దనుకున్నా తప్పులు చేస్తున్న. నాకు తెలుసు నేనే చేస్తున్నది. ఇంకొకరిపై నెట్టలేను. నన్ను నువ్వు దయతో క్షమించి నిష్క్రియునిగా చిత్రించి నీపై బాధ్యత వేసుకున్నావు - వద్దు.

అమ్మ :- నీకు నీవు చేస్తున్నట్లుగ అనిపించేట్టు చేస్తున్నది నేనే - నేను నిజం చెప్తున్నాను. నేను నీకు బాధ కలిగించాను. అంటూ నమస్కరించింది.

**– జిల్లెలమూడి అమ్మ**



43

## స్థితులు

1) పూర్తి పశ్చాత్తాపం కలిగితే అదే అనుభవించటం. అప్పుడు ఆ మనస్సుపడే "ఆవేదన" "ఎంతో" ఇంతని చెప్పలేము. అదే ప్రాయశ్చిత్తము.

సంకల్ప రహితమంటే కష్ట సుఖాలకు అతీతమైన స్థితి కాదు.

సర్వ వస్తువులు వాడే అనుకోవటమే.

నేను నీవైనప్పుడు స్థితి, పరిస్థితి అవుతుంది.

నేను ఎక్కడికి వెళ్ళినా అమ్మ నా వెంట వున్నది. నేను తప్పుచేస్తే అమ్మకు తెలుస్తుంది. అమ్మే చేయిస్తుంది. ఇవి రెండు స్థితులు. ఏది జరిగినా, ఎవ్వరు ఏది చేసినా మనం కాదు చేసేది. మనలను నడిపించే శక్తి మరియొకటి వున్నది అనుకోవటమే ఎక్సిపేరిమన్సే (అనుభవము).

**– జిల్లెలమూడి అమ్మ**



44

## సుగతి

1) అందరికి సుగతేనాన్నా! కాస్తముందు వెనుక తేడా! ఏ శక్తి నీకు ఏదో చెమాలన్న సంకల్పం కల్పించిందో, ఆ శక్తే నీవు చేయగల సాధనని నీ చేత చేయిస్తుంది. సాధకులన్నవారి సాధనలు అన్నీ ఒకేలాగ వున్నాయా.?
ధృవుడు, ప్రహ్లాదుడు, వాల్మీకి, వ్యాసుడు, అంబరీషుడు, నారదుడు - అందరికీ లక్ష్యము ఒకటే అయినా - సాధన అన్నది వేరే కదా!

గోదాదేవి, పెరియాళ్ళ వారుది, కన్నప్ప, మార్కేండేయుడు, కబీరు చైతన్యుడు - ఎవరిది సరిగ్గా ఇంకొకరి సాధనలాగా లేదుగా! సాధన అన్నది రైలుపట్టాల మార్గంకాదు, ఆ పట్టాలమీదపోతే అతని స్టేషను చేరడానికి. లక్ష్యమును చేరినవారి కరచరణాలు ఆడిన రీతినే మనము ఆడించాలనుకుంటే అది సాధన కాగలదా? విచార మార్గమనేదే చూడు విన్నవారంతా చేయగలుగుతున్నారా? అది వద్దు. పోనీ కవిత్వం సంగతి చూద్దాం. ఒకరు చేసినా, ఒకరు చెప్పినదారిలోనే సాగి మంచి కవిత్వము చెప్పిన వారున్నారా? ఏ శక్తి ఈ పని చేయడానికి నీకు ప్రేరణ కలిగించిందో ఆ శక్తి నీ చేత చేయిస్తుంది. అలాగ చేయడానికి నీకు కలిగిన అవకాశాన్ని గుర్తిస్తావు. ఇతరులు నీవు చేసినది "సాధన అని జాబిత వేసుకుంటారు"

**– జిల్లెలమూడి అమ్మ**

45

## కాలము

1) గుణములు కూడా కాలానికి లోబడి వుంటాయి.

ఉదా :- చింత చెట్టు వున్నది. దానికి చిగురు వేస్తున్నది. ముదురాకు వుంటుంది. పూలు పూస్తాయి. లేత కాయలు కాస్తాయి. ముదురు కాయలుంటాయి. పండుకాయలు వుంటాయి. అన్ని లక్షణాలు ఒకేసారి చూపించలేక పోతున్నది. కాలాన్ని అనుసరించి లక్షణాలు బహిర్గత మవుతూ వుంటాయి. చెట్టు వున్నదని గుర్తించింది నేను. చెట్టు ఎక్కింది నేను. కొమ్మ విరిగినట్లు గుర్తించింది, మరిఒక కొమ్మను ఆధారం చేసుకొన్నది నేను. చిటారు కొమ్మకు ఎక్కింది నేను. వూరు నాలుగు వైపుల చూచింది నేను. ఇదంతా నేనే అని అనుకున్నది నేను. అదే "నేననుకున్న నేను" అదే ఎవరికి వారు నేను అనుకుండే నేనే - నేననే నేను. నీవుగా చూడాలంటే నేను నీవై చూస్తారు. అదే నేననే నేను. ఇదే నేతి మహావాక్యాలు – **జిల్లెలమూడి అమ్మ**

2) అసలు తరుణమే కారణము. తరుణమునే కాలమన్నాము. ఆ కాలాన్నే పరిమితి గల నన్ను చూస్తే అనలేదు - అంతా అయిన శక్తిని గూర్చే చెప్పాను. ఒకడు ఆనందమయి దగ్గర (ఆనందం) పొందుతున్నాడు. ఒకడు సత్యసాయి బాబా దగ్గర (ఆనందం) పొందుతున్నాడు. ఒకడు బషీర్ బాబా దగ్గర, మరొకడు విగ్రహం దగ్గర పొందుతున్నాడు. తరుణమన్నప్పుడు అంతే తరుణమంటే - కాలం. బ్రహ్మ. స్వరూపం. సిద్ధాంత రీత్యా కనుపించని దైవము కలిగించే పరిస్థితుల ద్వారా వ్యక్తమవుతుంటుంది. – **జిల్లెలమూడి అమ్మ**

46

## మరణము

1) చనిపోతున్నప్పుడు చెప్పలేక పోవచ్చుకాని, తెలిపోతున్నట్టు వుంటుంది. మరణము చాలా హాయి అయినది. అది అఖండ సచ్చిదానందము లోనికి కలిసి పోవడము. ఆ హాయి తెలుస్తుంది. చనిపోతున్న వానికి చని పోతున్నానని తప్పకుండా తెలుస్తుంది. జ్ఞాని బ్రతికియుండి కూడా మరణం యొక్క హాయిని తెలుసు కుంటాడు. వున్నదంతా ఒక్కటే. అందుకే అందరికి సుగతి అన్నాను. సుగతి అంటే మీరనుకునే దుర్గతి లేదు. అని తెలుసుకోండి. (అంటే నరకం). మరణంతో ఈ సంకుచిత అహంకారము నా శనమవుతుంది. అఖండ సచ్చితానందం లోనికి లీనమవుతాడు. ఇంకా సుగతి కాక దుర్గతి ఎక్కడ నుండి వస్తుంది? పరిమితి గల మనస్సు అపరిమిత మనస్సులో కలుస్తుంది. **– జిల్లెమూడి అమ్మ**

2) మనస్సు నిద్రపోయి నప్పుడు మనస్సు తన స్వస్థానం చేరుకుంది. మనస్సులో ఒక భాగం మెలకువగానే వుంటుంది. నిద్రలోని ఆలోచనలే కలలు. ఒక భాగం తెలివిగా వుండ బట్టి పి లిస్తే మరల లేస్తాడు. మరణానికి నిద్రకు తేడావుంది. మరణంలో అఖండ సచ్చిదానందంలోనికి దూకటమే.

ఖండమనేది రూపం అఖండమనేది భావం. అంతా అయిన దానిలోంచి వేరైనాడు కదా! అందువల్ల తాను వేరనుకుంటున్నాడు. **– జిల్లెలమూడి అమ్మ**

3) మరణించట మంటే దేనిని చూచి చైతన్యమున్నావనుకున్నామో అది లేక పోతే మరణ మంటారు.

ప్రశ్న:- **చావు అంటే ఇంకోరూపం చెందడం. గీతలో ఈ శరీరం, బాల్యం, యవ్వనం, కౌమారం, వార్ధక్యం, పొందట మెలాగో ఇంకొక దేహం కూడా అంతేనా?**

అమ్మ:- దాని స్వభావమది (ఆశక్తి). ధరించే శక్తి ఒకటి వున్నది. ఎప్పుడూ ధరిస్తూనే వున్నది. అదేరావాలని ఏమున్నాది. శక్తి అనేక రూపాలుగా రావటం దాని స్వభావం. అనేకం కాగలిగిన శక్తి - శక్తికి యున్నది. దానిలో తరుగు లేదు. శక్తి రూపం భిన్నం. స్వరం ఒక్కటే. సప్తస్వరాలు కావు - సప్త స్థానాలు - ధ్వని ఒకటే. గొంతు ఒకటే. **- జిల్లెలమూడి అమ్మ**

4) జనన మరణాలంటే ఏమిటి? స్థూల శరీరం భూతేంద్రియ మనోమయ. ఆ శరీరంతో కర్మ ఫలాలు అనుభవింప బడుతున్నాయి. ఆ శరీరం లోపల లింగ శరీరమున్నది. అది జీవునికి ఉపాధి అవుతుంది. కర్మపలం భుక్త మైనశించి పోతుంది. అప్పుడు జీవుడు స్థూల శరీరాన్ని వదలి లింగ శరీరంతో వెలువడు తున్నాడు. స్థూల శరీర లింగ శరీరాల పరస్పర వియోగం మరణమన బడుతుంది. సంచిత కర్మలో పరిపక్వ మైన దానిని భోగించడానికి తధనుకూల మైన స్థూల శరీరంలోనికి జీవుడు మళ్ళీ లింగ లింగ శరీరంతో ప్రవేశిస్తాడు. ఆ రెండిటి కలయికను జన్మము అంటారు. భోగ్య కర్మమే జీవన విధానాన్ని ముందుగా సమకూర్చుతున్నది.

**- కపిల మహర్షి**



## 47

## సమాజము - నీతి నియమము

1) కట్టు బాట్లు వున్నవని తెలుసు. ఒకటి చేస్తూ - ఒకటి చేయలేక వున్నందుకే కర్మను తీసుకొని నెట్టి వేస్తున్నాము. ఒకే వృక్షంలోనుండే కొమ్మలు వచ్చాయి. కొమ్మలు అన్నీ సమంగా లేక చీలిక ఎందుకు వచ్చినది అంటే చెప్పలేం రెండుగా ఏర్పడక పోతే సృష్టి లేదు. అది సృష్టి యొక్క విధి. వీడికి ప్రత్యేకించి కర్మ లేదు. దైవమే అలా వున్నది. ఆనందం అనిపించేది ఇదే- కష్టమని పించేది అదే - ఋణసంబంధం అంటే ఎప్పటికీ ఋణంతెంపు? కూర్చున్నా - నిల్చున్నా - తిన్నా, త్రాగినా అంతా ఋణ సంబంధం అంటే ఎట్లా. తరుణమే కాని ఋణం లేదు. - **జిల్లెలమూడి అమ్మ**



48

## సర్వముతో తాదాత్మ్యము

1) అమ్మకు సర్వముతో తాదాత్మ్యమున్నది ఏమంటే అమ్మ అన్నది " మీరంతా పుట్టినది ఇక్కడనే నేనే పెంపుడిచ్చాను, మీ తల్లులకు". మరోమారు " అందరూ నావడిలోని వారే. ఒక్కరూ వడి దాటి లేరు. అన్నారు. మనకు ఇలాంటి తాదాత్మ్యము రమన భగవాన్ మాటలోను కనబడుతుంది "ఓహో! తినేవారు మీ రొకరు వేరేవున్నారా! ఎక్కడ తిన్నా స్వామే అని మీకు తెలియదా! ఆ యాపిల్ పళ్ళు మీరు తినాలని తెచ్చాను - అని ఒక అమ్మ అంటే ఇప్పుడు తినే వారెవ్వరు అన్నారట ఆయన అందరికి ఆ పళ్ళు పంచి పెట్టి. (2) సర్వముతో తాదాత్మ్యము వున్నవారికి రామకృష్ణ పరమహంస చెప్పిన " ఇన్ని నోళ్ళ ద్వారా తింటున్నావు. చాలదా! ఈ నీ నోటితోనే తినాలా ? అన్నారు. భరద్వాజ తన పుట్టిన రోజున నైవేద్యము పెట్టిన పాయసమును " తిను, ఈ కొంచెముతిను" అంటూ ఎవర్నోతినమని బుజ్జగిస్తున్నట్లుగతానే తిని, భరద్వాజ ఎవరి కమ్మా పెట్టేవు అని అడిగితే "శ్యామలరా ! పాపం. ఆ చెట్టుకింద కూర్చుంది. దానికి ఎవరు పెడతారు. అన్నారట అమ్మ. ఎక్కడో పెట్టిన నైవే ద్యమును తినకుండానే "తినడము" తానిక్కడ తిని ఇంకొకరికి ట్రాన్సుపరు చేయడం ఎవరికి సాధ్యం? సర్వమూతో తాదాత్మ్యమున్న వారికి కాని సాధ్యము.

**– జిల్లెలమూడి అమ్మ**

# 49
## స్వతంత్ర్యము

1) భగవానుడు బ్రహ్మముఖతః చెప్ప చున్నాడు.

నేనుగాని (బ్రహ్మ) ఈ నారద మహర్షిగాని స్వతంత్ర్యలము కాము. అందరమూ భగవదా జ్ఞానుసారమే నడుచుకుంటున్నాము. భగవాన్ నిర్మాణాన్ని మార్చుకూడదా అంటావేమొ? పరమాత్మని నిర్మాణాన్ని మార్చటానిక అర్థపతులు, ధర్మ పరులు, మనీషామతులు, విద్యా విధులు, తపోధనులు, యోగీశ్వరులు - వీరిలో ఎవరూ స్వయంగా కానీ, బలవదాశ్రయ లబ్ధిచేతనైతేనేమి సమర్థులు కారు. ఇంతెందుకు ? పరమేశ్వర విధి ప్రకారము జీవునికి దేహం కలుగుతున్నది. దేహాలు జీవులనుభవింప వలసిన శోక మోహ సుఖ దుఃఖాదులకు తగినట్లుగా కల్పింప బడుతున్నాయి. భోగ్య పలం భుక్తమయినంతనే ఆ దేహాలు పతనమవు తున్నాయి. జనన మరణ విషయాల యందే జీవునికి స్వతంత్రం లేదంటుంటే తక్కిన వారిని గురించి అనుకోవడం ఎందుకు. కర్మాచరణలో కూడా జీవునికి స్వతంత్రం లేదు. కర్మములు వేద ప్రతి పాదితములు. వేదాలు పరమేశ్వరుని ఆ జ్ఞాజాల మాత్రాలు. జీవులు వేద సూత్రనిబద్ధ కర్మపరులై ముక్కుకు తాడు బిగించిన ఎడ్లవలె వర్థిల్లుతారు. భోగ విషయములలో కూడా జీవునికి స్వాతంత్ర్యం లేదు.

గుణాలను బట్టి! కోరికలు, కోరికలను బట్టి కర్మములు, కర్మములను

బట్టి తత్పలాలు, కర్మ పలాలను బట్టి నరతిర్యగాది భోగ శరీరాలు ఆ శరీరాలతో అనుభవింప నైన సుఖదుఃఖాదులు కలుగు తున్నాయి. ఆ సుఖ, దుఃఖాదులను అనుభవింపక తప్పదు. సృష్టి సకలం ఈ విధంగా నియమ బద్ధమై యున్నది. ఇదే భగవదాజ్ఞ. ఆ ఆజ్ఞను అతిక్రమించటం ఎంత వారికైన సాధ్యం కాదు. అంటే స్వభావము (గుణములు) పరమాత్మ ప్రసాదము

**– భాగవతం**

2) భగవాన్ ఉవాచ:- మునులారా! సంసారం కర్మాత్మకం కనుక కర్మమును విసర్జినంతనే సంసార నివృత్తి కలుగు తుందని భావింపకూడదు. కర్మములన్నీహస్త, పాదాది కర్మేంద్రియాలతో చేయబడుచుండటం అందరికీ తెలిసిందే. హస్తాదులు జడములు కాబట్టి వాటికి స్వాతంత్ర్య శక్తి లేదు. ఈ కర్మేంద్రియాలను, జ్ఞానేంద్రియాలు నడుపుతూవుంటాయి. సూక్ష్మ దృష్టితో విచారిస్తె జ్ఞానేంద్రియాలు కూడా జడములేనని వాటికి కూడా స్వాతంత్ర్య శక్తి లేదని, వాటిని నడిపే శక్తి మరొకటి యున్నదని ఏర్పడుతుంది. ఆ శక్తినే పరమాత్మ శక్తి అనుకున్నాము. ఆ శక్తి కూడా స్వతంత్రించి వర్తింపదు. పరమాత్మ ఏమని సంకల్పించితే ఆ విధంగా వర్తి స్తుంది. కాబట్టి సర్వవ్యాపారానికి పరమాత్మయే మూలమని తేలుత్నుది. **– భగవతం**



50

## నామస్మరణము

1) హరినామ స్మరణ, గురునామస్మరణ, మోక్ష ప్రదము కలియుగంలో

– షిరిడీ సాయి బాబా

2) చౌర్యం, సూరాపానం, మిత్రద్రోహం, బ్రహ్మహత్య, గురుదార సంగమం, స్త్రీహత్య రాజ, పితృహత్యలు మొదలైనవి మహాపాతకాలు అని అంటారు. ఇవేకాక ఇంతకంటే కోటిరెట్లు హెచ్చయిన పాపాలుకూడా హరినామ స్మరణ మాత్రాన తొలగిపోతాయి. అంతేకాదు కోటి కోట్ల జన్మల పాపరాశికి సహితం హరినామ స్మరణ పరమ ప్రాయశ్చిత్తమవుతుంది. భగవన్నామాన్ని స్మరించే వాడు పాపరహితుడు కావడమే కాదు, పునీతుడు కూడా అవుతున్నాడు. ఎప్పుడు పునీతుడు అయినాడో అప్పుడే అతను భగవత్ కరుణకు పాత్రుడు కాగలడు. వ్రతాదులు పాపపరిహారానికీ గాని చిత్తశుద్ధికరాలుకావు. హరినామ స్మరణ పాపమాలాన్ని దురీకరించడమేకాక చిత్తాన్ని శుద్ధిపరచి ఉత్తమ శ్లోకుల గుణాలను మనో మందిరంలో నిక్షేపిస్తుంది. ప్రాయశ్చిత్తాలు వాసనలను మాత్రమే తొలగిస్తాయి. చిత్త మలాన్ని హరింపలేవు. హరినామ స్మరణ సర్వ మలాపహారమైనది. దాని ప్రభావం వలన చిత్తము ఎన్నటికి మళ్ళీ పాపముఖం కాదు. బుద్ధి పూర్వకంగాకాని లేక అబుద్ధి పూర్వకంగా నైతేనేమి. హరినామ స్మరణ చేస్తే వాడికి ఇక నరక యాతనలకు తగడు. ఎలాగైతే తెలిసికాని,

తెలియకగాని, అగ్నిని తాకినప్పుడు అది కాల్చకమానదు. అట్లాగే హరినామ స్మరణను తెలిసిచేసినా, తెలియక చేసినా పాపజాతం దహింపబడక మానదు. ఔషదమే ఇందుకు నిదర్శనం. – భాగవతం

3) భగవన్నామాన్ని తెలిసి జపించినా, తెలియక జపించినా దానిఫలం ఒక్కటే. అగ్ని ఆహుతులను భుజించినట్లు, భగవన్నామం సకల పాపాలను భస్మీకరిస్తుంది. శక్తి వంతమైన ఔషధాన్ని యదృచ్ఛా భావంతో గ్రహించిన దాని ప్రభావాన్ని చూపక మాననట్లు అజ్ఞానవశాన ఉచ్చరించినా, నామమంత్రమైన విజ్ఞానాన్నే కూర్చక మానదు. పాప నిలయమైన కలియుగంలో జన్మించిన వారికి ఒక్కలాభం వున్నది. కృత యుగంలో ధ్యానము, త్రేతాయుగంలో యజ్ఞయాగాలు, ద్వాపర యుగంలో ప్రతిమార్చన కలియుగంలో నామకీర్తన మోక్షకారణాలు. – భాగవతం



51

## శక్తి

**1) ప్రశ్న :- శక్తి కనిపించదా?**

అమ్మ :- ఒకేలాగ కనిపించదు. అన్నిటిగా కనిపిస్తుంది. లక్ష్మి అంటే ఉపయోగపడే వస్తువు. పార్వతి అంటే అందులో ఇమిడియున్న శక్తి. దానిని గ్రహించే శక్తి సరస్వతి. ఆ చెట్టులో ఆ గుణం వుందని గ్రహించటం సరస్వతి. పార్వతి అంటే పారము లేనిది. అపారమైనది. రూపమంతా లక్ష్మి. విష్ణువుకు పోషకత్వం వుంది. విశిష్టమైనవాడు విష్ణువు. పోషణం అంటే ఉపయోగ పడటం. అతని భార్య లక్ష్మి ఆ లక్ష్మి-ఈ వస్తువు. ప్రకృతి - పురుషుడు వేరుకాదు. కాబట్టి లక్ష్మి విష్ణువు వేరుకాధు. లయానికి ఉత్పత్తికి శక్తి పార్వతి. ఎక్కడి కక్కడ మాతృత్రయం కలిసే వుంది.

**ఇక ప్రత్యేకత ఏమిటి?**

అమ్మ :- చెట్టుపూలు పూయటం, పండటం, వాడటం - ఈ పనిఅంతా పార్వతి శివుడు లయకారుడు. బ్రహ్మ ఉత్పత్తి స్థానం. దానిని గ్రహించే స్థానం విద్య. ఇది మొలచి తీరాలి. అనే విధాత బ్రహ్మ. దానిని గ్రహించేది సరస్వతి, బ్రహ్మ భార్య సరస్వతి - శక్తి - సరస్వతిగా - పార్వతిగా లక్ష్మిగా, బ్రహ్మగా, విష్ణువుగా, శివుడుగా - సర్వమైనది మూలశక్తి - మూల ప్రకృతి అంటారు కదా. మూలమంటే మొదలు. మొదలు ఏదో చివరా అదే. వున్నదే అది. దారానికి అటూ, ఇటూ మొదలు కదా! దారానికి రెండు వైపులు దీనికి అది మొదలు, దానికి ఇది మొదలు.

**– జిల్లెలమూడి అమ్మ**

